# దశరూపక సారము

కూర్పరి :
గడియారము రామకృష్ణశర్మ



ప్రచురణ :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
హైదరాబాదు — ఆం. ప్ర.

మూల్యము 1-4-0

# తొలిపలుకు

సంస్కృతమునఁ గావ్యరసధ్వన్యలంకారాదులను లక్ష్యలక్షణ సమన్వయ పూర్వకముగా వివరించు గ్రంధము లనేకము లున్నవి. వానికలంకార శాస్త్ర గ్రంథములని పేరు సాహిత్య. తదంగ స్వరూపమును వివరించు గ్రంథములు కావున నిజమునకు వాని నలంకార శాస్త్ర గ్రంధము అనుటకంటె సాహిత్య శాస్త్ర గంథము లనుట యెక్కువ సమంజసముగా నుండును. ఏలయన నలంకారము సాహిత్యము నందలి యేకదేశము మాత్రమే కావ్యరసాదుల లక్షణములిందుఁ జెప్పఁబడును గావున వీనిని లక్షణ గ్రంధము లనియుఁ బిల్చుచుందురు. సంస్కృతమున నిట్టి లక్షణ గ్రంథములకు భరతనాట్యశాస్త్రమాద్యము. తరువాత దాని నాధారము చేసికొని కావ్యరస ధ్వన్యలంకారాదుల లక్షణములను విపులముగా వివరించు గ్రంథము లనేకములు బయల్వెడలినవి. అట్టివానిలో ధనంజయుని దశరూపక మొకటి.

సంస్కృత లాక్షణికుల మతమునఁ గావ్యము శ్రవ్యమని దృశ్యమని రెండు విధములు. దృశ్యకావ్యమునకు రూపక మనునది నామాంతరము. రూపకములలోఁ బది ప్రధాన భేదము లున్నవి. ఇవిగాక యుపరూపకములు మఱికొన్ని యున్నవి. దశరూపకమున వాని లక్షణములు, రసవస్తు నాయకులనెడి వాని యంగములు సమగ్రముగా వివరింపఁబడినవి. సాహిత్య దర్పణము, ప్రతాపరుద్రీయము మున్నగు లక్షణ గ్రంథములలోఁ గూడ వాని వివరణ మున్నది. కాని యవి రూపకములతో పాటు సర్వకావ్య లక్షణములను వివరించును. దశరూపక మట్లుగాక యొక్క రూపకముల లక్షణమునే విపులముగా వర్ణించును. అందుచే రూపక లక్షణ పర్యాలోచన విషయమున దానికిఁ బ్రాధాన్య మెక్కువ.

ఆంధ్రమునందలి సర్వసాహిత్య మార్గములకును సంస్కృత వాఙ్మయమే మార్గదర్శకము. అందలి పురాణేతిహాస కావ్యాదు లన్నియుఁ దెలుఁగునకు వచ్చినవి కాని యందలి రూపకములు మాత్రము మొన్న మొన్నటి వఱకును ఇందపురూపమైనది. "కావ్యేషు నాటకం రమ్య"మ్మను నానుడి యందలి సత్యము నెఱింగిన వారయ్యుఁ బూర్వాంధ్రకవులు సంస్కృత రూపకముల దెనిఁగించుటకుఁ గాని అట్టి వానిని దెలుఁగున స్వతంత్రముగా వెలయించుటకుఁగాని పూని యుండలేదు మంచన, పిన వీరభద్ర, నంది మల్లయ, ఘంట సింగనాది కవులు నాటకములనే ప్రబంధ రూపమున వెలయించిరి దీనినిబట్టి చూడ నప్పుడు రూపకములను రూపకములుగానే రచించుట కేవో కొన్ని యాటంకములుండ వలెనని తోపక మానదు.

తెలుఁగున సాహిత్య శాస్త్రమును వివరించు లక్షణ గ్రంథముల సంఖ్య తక్కువ. అట్టివానిలో విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి మొదటిది. తరువాతఁ బేర్కొనఁ దగినది భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహ మనెడి నరస భూపాలీయము. ఇందాతఁడు ప్రతాపరుద్రీయము ననుసరించి సర్వలక్షణములను వివరించెను కాని నాటక ప్రకరణములను విడిచివైచెను. 'ఈ శాఖకుఁ జెందిన కావ్యములు తెలుఁగున లేవు గదా వీని లక్షణమును వివరింప నేల' యని యాతఁడా ప్రకరణము నుజ్జగించి యుండును ఇటీవల సాహిత్య దర్పణ, ప్రతాపరుద్రీయ, దశరూపకాదు లన్నియు యథాతథముగ దెలుఁగున కనువదింపఁ బడినవి.

గత శతాబ్ది యుత్తరార్ధము వఱకును దెలుఁగున యక్షగానము లనెడి దేశిరూపకములే కాని సంస్కృత రూపకములవంటి రూపకములు వ్రాయబడి యుండలేదు. అప్పటినుండి యీ శాఖ వేగముగా వికాసము పొందినది. అందుచే వానిని జదువువారు తల్లక్షణములను గూడ నెఱుంగ

వలసిన యావశ్యక మేర్పడినది. విశ్వవిద్యాలయ విద్యార్థులకును, ఇతర పరీక్షార్థులకును, రూపక లక్షణ పరిజ్ఞానమునకుఁ దోడ్పడు నాంధ్ర గ్రంథములొండు రెండు కంటె నెక్కువ లేవు. అవియైనను సంస్కృతమున కనువాదము లగుటచే విద్యార్థులకు సుబోధములు కావు

అందుచే శ్రీ గడియారము రామకృష్ణశర్మగారు దశరూపకాది సంస్కృత గ్రంథములనే కాక ఆంగ్ల కన్నడాదులందు రచింపఁబడిన యితర లక్షణ గ్రంథములను గూడఁ బరిశీలించి విద్యార్థి జనుల కత్యంతోపయోగకరముగానుండు నట్టి దశరూపక సారమును రచించిరి. ఇందు రూపక లక్షణములు, రసవస్తు నాయక లక్షణ స్వరూపములు, రూపకోత్పత్తి రూపక వికాస వృత్తాంతము సంగ్రహముగను సుబోధముగను వివరింప బడినవి దీనిని బఠించు పరీక్షార్థులకు రూపకముల విషయమున జ్ఞాతవ్యములైన సర్వ విషయములను లెస్సగా నవగాహనమగు ననుటలో సందేహము లేదు ఇందలి భాష సరళమై అనవసర సాంకేతిక పదాడంబరము లేక సుబోధమై యలరారుచున్నది. రూపకలక్షణములు తెల్పు గ్రంథము లెక్కువగా రచింపఁబడని కతమునను, రచితములైనవి అలభ్యములై యున్న కతమునను, ఈ దశరూపక సారము రూపమునఁ జిన్నదయ్యు నుపయోగమునఁ బెద్దదై కళార్థులకుఁ గల్పకమై విరాజిల్లునని తలంచుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని
ఉస్మానియా విశ్వవిద్యాలయము

# తోడ్పడిన గ్రంథములు.

1. దశరూపకము—(సంస్కృతము) ధనంజయుడు.
2. రసార్ణవ సుధాకరము—సింగభూపాలుడు. (శ్రీ బులుసు వెంకట రమణయ్యగారి అనువాదము)
3. నాట్యశాస్త్రము—శ్రీ P. S. R. అప్పారావుగారి అనువాదము.
4. కావ్యాలంకార సంగ్రహము—శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు.
5. సంస్కృత నాటక (కన్నడము)—శ్రీ A. R. కృష్ణశాస్త్రిగారు.
6. భారతీయ కావ్య మీమాంసె—(కన్నడము) శ్రీ తి. నం. శ్రీకంఠయ్యగారు.
7. గీర్వాణ రూపకము—శ్రీ తల్లావఝుల కృత్తివాస తీర్థులుగారు.
8. భారతీయ కావ్య శాస్త్రకీ పరంపరా—(హిందీ) డా॥ నాగేంద్ర్.
9. రసభారతి—శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మ గారు.

# నివేదనము

ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆదేశమును పురస్కరించుకొని పరీక్షార్థులకును, జిజ్ఞాసువులకును సుబోధముగ నుండునట్లు ఈ "దశరూపక సారము" సంగ్రథనము చేయబడినది. ఇది ధనంజయుని దశ రూపకమున కనువాదముకాదు. దశ రూపకములకు కావలసిన అంశము లన్నియు నొక క్రమము ననుసరించి వీలైనంతవరకు సమగ్రముగ, సంగ్రహముగ ఒకచోఁ జేర్చుటకు ప్రయత్నము చేయఁబడినది. ఈ సందర్భములో చాల గ్రంథము లుపయోగ పడినవి. ఆ యా గ్రంథకర్తలకు ప్రణతి శతములు. ముద్రణ కాలమున పరిజూచి తొలిపలుకు వ్రాసి యిచ్చిన పూజ్యులు డా॥ దివాకర్ల వెంకటావధాని గారికి ధన్యవాదములు.

ఈ కృషి ఎంతవరకు సాఫల్యము నందినదో పాఠక లోకము నిర్ణయింపవలసి యున్నది. నా అల్పజ్ఞత వలన నిందు దొరలిన దోషములను విబుధులు తెలియఁజేసినచో వినమ్రుఁడనై సవరించుకొనెదను. నాకీ అవకాశమును కలిగించిన పరిషదధ్యక్షులు శ్రీ నూకల నరోత్తమ రెడ్డిగారికిని, ఉపాధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికిని కృతజ్ఞుఁడను.

అలంపూరు<br>శార్వరి వసంతము

గడియారము రామకృష్ణశర్మ.

# వి ష య సూ చి క

# ప్రథమ ప్రకాశము

**ఉపక్రమణిక :**

సంస్కృత సాహిత్యమునందు నాటకమునకు మహోన్నత స్థానము కలదు. సాహిత్య సోపానములలో నది అన్నిటికంటె పైమెట్టని భారతీయులు భావించెదరు. ఇది సరియైనదే నాటకము నందు లలితకళ లనేకములు సామరస్యముతోగూడి అనిర్వచనీయ రామణీయకతను ప్రసాదించుచున్నవి. చారిత్రక దృష్టితో జూచి నను నాటకము సాహిత్య గుచ్ఛమున చివర పూచిన మహాపుష్ప మనుట గోచరించును.

నాటక మనునది రూపక సాహిత్య శాఖ యందలి అంతర్భేదములలో నొకటైనను రూపక సామాన్యమునకు గూడ నీ వ్యవహారము గలదు. ఆలంకారికులు కావ్యమును "దృశ్య"మని "శ్రవ్య"మని రెండు విభాగములుచేసి నాటకాదులను దృశ్యములుగ పరిగణించిరి దృశ్యమనగా జూడదగినది. వీనికిరూపకములని నామాంతరము సాహిత్యమును కావ్య, నాట్య విభాగములుగజేసి రూపకమును నాట్యవర్గమున చేర్చుటగూడ కలదు.

నాట్యమనగా సంగీత, సాహిత్య అభినయములతో గూడిన ఆట దీనినిబట్టి నాటకమున కావ్య, నృత్య, గీతములు చేరియున్న వని చెప్పవచ్చును నాటకమును ప్రయోగించుటకు చిత్ర, శిల్పాది

లలితకళల తోడ్పాటు అవసరమై యుండును. ఈ విధముగా నాటకము లలిత కళానిలయమై అపూర్వ రమణీయత్వముతోగూడి నా నా రుచులుగల వివిధ జనులకు ఆనందదాయక మగుచున్నది

నాట్యోత్పత్తిని గూర్చి ప్రాచ్య, పాశ్చాత్య పండితులలో మత భేదములు కలవు భారతీయ మతమును నందికేశ్వర, శారదా తనయాదులు తమ గ్రంథములలో వివరించినారు భరతుడు నాట్యోత్పత్తి నిట్లు తెలిపెను

"పూర్వము త్రేతాయుగమున లోకము కామక్రోధాదులకు వశమై సుఖ దుఃఖ భాజనముగ నున్నప్పుడు మహేంద్రాది దేవతలు బ్రహ్మను దర్శించి దృశ్యము, శ్రవ్యమునయి అందరును పాల్గొని ఆనందింప దగిన ఒక క్రీడా విశేషము ననుగ్రహింపుమని వేడు కొనిరి ఆయన సమ్మతించి ఋగ్వేదము నుండి సాహిత్యమును, యజుర్వేదము నుండి అభినయమును, సామము నుండి గానమును, అధర్వణము నుండి రసమును గ్రహించి "నాట్య"మను నైదవ వేదము ను సృష్టించెను. భరతుడు దానిని పరిగ్రహించి తన సంతానముతో నప్సరసలతో గూడి ఇంద్రధ్వజోత్సవ మందు ప్రదర్శించెను అందలి వస్తువు దేవతలు దానవులను జయించుట నాట్యప్రయోగము ప్రారంభించుచుండగనే రాక్షసులు లేచి అల్లరి చేసిరి ఇంద్రుడు తన ధ్వజ దండముతో వారిని పారద్రోలెను. ఇక ముందిట్టి యల్లరుల వలన ప్రయోగ భంగము కారాదని బ్రహ్మ నాట్యమందిరమును సూచించెను. ఆ నాట్య మండపమునకు వివిధ భాగములలో దిక్పాలకులు నిలచి రక్షించుచుండిరి. ఈ లోగా

దైత్యులు బ్రహ్మను జూచి "స్వామీ, మీసంతానమునకు జెందిన మమ్ము నవమానించుటకు నాట్యమును సృష్టింప వచ్చునా"యని ఆక్షేపించిరి బ్రహ్మ వారికి సమాధానమొసగుచు "మీరీవిధముగ భావింపరాదు నాట్యమనునది లోకమందలి వివిధ భావముల యను కరణము దీనియందు కొన్ని కొన్ని చోట్ల ధర్మ, కామ, క్రీడా, హాస్య, యుద్ధాదులు కానవచ్చును ధర్మ ప్రవృత్తులకు ధర్మము, కాముకులకు కామము, దుర్వినీతులకు నిగ్రహము, వినీతులకు దమము, అజ్ఞానులకు జ్ఞానము, దుఃఖితులకు స్థైర్యము, అర్థోపజీవులకు ధనము కలిగించునట్లు నేను రచించిన నాట్యము నా నా భావములను, అవస్థలను పొంది లోకవృత్తము ననుకరించి హితమును, సుఖవినోదాదులును ప్రసాదింపగలదు ఇందు లేని దేదియులేదు సుఖ దుఃఖములతో గూడిన లోక స్వభావాభినయమే నాట్యము అందువలన మీరు కోపగింపరాదు, పొండ"ని సమాధాన పరచి పంపెను ఇదియే ప్రాయశః నాట్యోత్పత్తికి సంబంధించి మన గ్రంథములలో గానవచ్చు ప్రాచీన మతము.

ఋగ్వేదమున గొన్ని సంవాద సూక్తములు గానవచ్చు చున్నవి. "యమ యమీ సంవాదము" "ఊర్వశీ పురూరవ స్సంవాద"ము మొదలైనవి అట్టివి. ఋత్విజులా యా దేవతల, ఋషుల స్థానములలో నిలచి రంగముమీద నటులు సంభాషణ జరిపినట్లే పైసూక్తములను జెప్పుచుండిరి యజుర్వేదము-నందు బహువృత్తుల నవలంబించిన జనుల ప్రస్తావన కలదు. దానిలో "శైలూష" పదము గాన వచ్చుచున్నది.

పురాణేతిహాసములలో గూడ నాటక ప్రస్తావన కలదు. మహాభారతమున "నట" శబ్దమున్నది హరివంశము నందు నటులు రామాయణ కథ నాడినట్లు చెప్పబడినది రామాయణ మందును నట, నాటకములు పేర్కొనబడినవి.

పురాణములు నాటకోత్పత్తికి, పెంపుదలకు చాల తోడ్పడి యుండవచ్చును పౌరాణికులు పూర్వకాలము నుండియు పురాణ ములను జెప్పుచుండిరి పాఠకులు సాధారణముగా రాగముతో జదువుచుండిరి ధారకులు వానిని వివరించి చెప్పుచుండిరి కథకులు అభినయ, నృత్య, గీత, వాద్యములతో దానిని రసవంత మొన ర్చుచుండిరి. నటులకు భాగవతులను వ్యవహారము నేటికిని కలదు. నాటక పురాణములకు గల ఘనిష్ఠ సంబంధము ఆదినుండి వచ్చు చున్న ఆచారము నేటికిని జంత్ర గాత్రములతో చెప్పబడుచున్న పురాణ, హరికీర్తన పద్ధతులు నాటకమున కాదిరూపములు గావచ్చునేమో ?

## రూపకోత్పత్తి :

'నాట్య' శబ్దము "నట్" ధాతువునుండి పుట్టినది. "నట్" అనునది "నృత్" ధాతువునకు ప్రాకృత రూపము. ఈ ధాతువు నకును, వీనినుండి నిష్పన్నములైన "నృత్త", "నృత్య", "నాట్య" "నాటక" శబ్దములకును "చిందులు త్రొక్కుట" అనునది మూలార్థము. కాని వీనిలో పరస్పర వ్యత్యాసము లున్నవి. "నృత్త"

మనగా తాళ లయల ప్రాధాన్యముతో త్రొక్కుచిందులు¹ వీనికి సంగీతము సహాయకముగ నుండవచ్చును. నృత్తము నొకరో, పలువురో చేయవచ్చును. ఇందు భావ ప్రకాశనము గాని, అభినయము కాని ఉండదు. "నృత్య" మనగా నదియు చిందులు త్రొక్కుటే. ఇందు రాగ, తాళము లుండును. వాచిక ప్రాముఖ్యము లేని భావ ప్రదర్శనము ప్రధానమైయుండును. (అష్ట పదులను, క్షేత్రయ్యపదములను ఇప్పటికిని అభినయించు చున్నారు "నృత్యము"న సంతోషము, దుఃఖము, తర్జనము, అభ్యర్థనము మొదలైన భావములలో నేదోయొకటి యుండును వీనిని ప్రదర్శించువారికి వేషభూషాదుల అవసర ముండదు "నృత్యము" నందలి భావాభినయము "మార్గి", "దేశి" అని రెండు విధములుగ నుండును. మరల నివి "లాస్య", "తాండవ" ములను రెండు విధములుగ నుండును. వీనికి మధురతా, ఉద్ధతలు ఆధారములు. ఇవి నాటకాది రూపకములలో నుపయుక్తములగును. "నాట్య" మనగా నృత్త, నృత్యములలో లేని అవస్థానుకరణము "అవస్థ" యనగా నేదో యొకవ్యక్తి స్థితిగతులు ఆ కారణము వలన నాట్యము నభినయించువాడు తా ననుకరించు వ్యక్తి వేష, భూషాదుల ననుకరించును; అతనివలె మాడాడును. ఈ యనుకరణము సమగ్రమగుటకు ఇతర పాత్రల సహాయము పరికరములు కావలసియుండును. వీని సహాయముతో నతడు తా ననుకరించు వ్యక్తిభావ

---

*1. అన్యద్భావాశ్రయం నృత్యం. నృత్తం తాల లయాశ్రయమ్. (దశరూపకమ్. 1-9)

ములను ప్రదర్శించుటే గాక, నానా దృశ్యములను గల్పించి ప్రేక్షకుల మనస్సులందు వివిధ రసానుభవము కలిగించును. అదియే రూపకము 2 రూపకములు పది విధములు వానిలో "నాటకము" ముఖ్యమైన యొక విధము.

"నాట్యము" నృత్యమునకు విస్తర రూపము "నృత్యము" "నృత్త" జన్యము అందువలన నీ యన్నిటిలో "చిందులు", వానికి తగిన సంగీతము ఉండును. నృత్తమునకు సంగీత మవసరములేదు నృత్యమునందు పై పాటకాండ్రు వాద్యములతో పాటను పాడుచుండ నర్తకు డా పాటను ఉచ్చరించు చున్నట్లు కనబడుచు, నందలి భావము నభినయించును. నాట్యమున గూడ పాటను పై పాటకాండ్రే పాడి నటున కభినయము మాత్రము వదలు పద్ధతి నేటికిని మళయాళ దేశమందలి "కధకళి" అను మూకనాట్యమున కానవచ్చు చున్నది. బయలు నాటకములలో నటుడు పాటపాడడు; పై పాటకాండ్రు పాడెదరు అత డెగురుచు నభినయించును. మాటలు వచ్చినపుడు ఎగురుట నిలిపి, కొద్దియభినయముతో మాటల నుచ్చరించును ఈ విధముగ నాట్యమునందు "గద్యము" ప్రవేశించి, పెరిగి సంవాదమును, కథను వృద్ధిచేసినది. రాను రాను నృత్య గీతములు తగ్గినవి. ఇప్పుడు సంస్కృత సాహిత్యమున గానవచ్చు నాటకములన్నియు గద్య, పద్యాత్మకములయి యున్నవి.

---

2. అవస్థాను కృతిర్నాట్యమ్ రూపం దృశ్యతయోచ్యతే ।
రూపకమ్ తత్సమారోపాత్ . (ద. రూ.) 1–7

రసోత్పత్తికి నృత్యగీతములు పరిపోషకములు గావచ్చును. కాని ఆవశ్యకములు గావు. అందువలననే ఉత్తమ శ్రవ్య నాటకముల వలన గూడ రసోత్పత్తి యగును రసమునకు ముఖ్యకారణములు ఘటనా విశేషములు, సన్నివేశ వైచిత్ర్యములు, పాత్రల గుణశీలములు మాత్రమే. వీనియందు కల్పనా కౌశల్య మును, ప్రతిభను ప్రదర్శించి కవి తన కృతిని రసవంతముగ జేయవచ్చును. ఇవి లేనిచో నుత్తమ కావ్య మనిపించుకొనదు. అట్లే నృత్య గీతాభినయములు లేనిచో నుత్తమ నాటకము కాజా లదు. లాక్షణికులందఱును నాట్యస్వరూపమును గూర్చి యొకేరీతిగ వివరించిన వస్తుస్థితులనుబట్టి అది క్రమ పరిణామము చెంది నట్లూహింప వచ్చును.

నాటక విచారము చాలగొప్పది దాని యొక్కొక్క భాగ మును గూర్చి యొక్కొక్క శాస్త్రము వివరించును. సాహిత్య శాస్త్రము నందు కావ్యాంశము, నాట్య శాస్త్రమున నభినయాంశము, సంగీత శాస్త్రమున సంగీతాంశము, వాస్తు శాస్త్రమున నాట్యమందిర నిర్మాణము వివరింప బడినవి. ఈ యన్ని యంశములను భరతుని "నాట్యశాస్త్ర" మొక్కటే వివరింప గలదు

ఇంతవరకు మనకు లభించిన లక్షణ గ్రంథములలో భరతుని నాట్యశాస్త్రమే మిగుల ప్రాచీనమైనది. దీనికంటెను ముందు "శిలాలీ, కృశాశ్వు"లను వారు "నట సూత్రము"లను వ్రాసిరని "పాణిన్యాచార్యుడు" తెలిపినాడు. అవి యుపలబ్ధములు కాలేదు. భరతుని కాలమును గూర్చి బహుమతము లున్నవి ఆ

మహర్షి ఒక నిర్దిష్ట కాలమున నుండెనని గట్టిగా చెప్పుట కాధారము లేవియు లేకున్నను పాశ్చాత్య పండితులును, వారి యనుయాయు లును "నాట్య శాస్త్రము క్రీ శ ప్రథమ, ద్వితీయ శతాబ్దములలో రచియింపబడి యుండు"నని నిర్ణయించినారు. అంతియేగాక వారు భారతీయ నాటకములు గ్రీకు నాటకముచే ప్రభావితము లయినవని వాదించుటకు గూడ సాహసించు చున్నారు. గ్రీకులనుండి రోమ నులు, ఇతర ఐరోపీయ జాతులు నాట్యవిద్యను నేర్చుకొన్నట్లు సూచించు చిహ్నములు నేటికిని వారిలో మిగిలియున్నవి. ఇట్టి యనుకరణ చిహ్నములు సంస్కృత నాటకములలో లేవని ఖండి తముగ జెప్పవచ్చును.

గ్రీకు నాటకోత్పత్తికి భారతీయ నాట్యోత్పత్తికి ప్రాచీన సాంస్కృతిక సంబంధమేదైన నుండవచ్చును. గ్రీకు నాటకమునకు "డయోనిసెస్" దేవతా ఉత్సవ కాలమున కైంకర్య రూపమున చేయుచుండిన నర్తనమే మూలము. భారతీయ నాట్యమునకు మూలాధారము శివుడు శివుని "మెగస్తనీసు" మొదలగు ప్రాచీన గ్రంథకర్తలు "డయోనిసెస్"అనియే వ్రాసియున్నారు. ఆ దేవుని యుత్సవమునందు లింగపూజ యుండినది; వీని వర్ణనలను జదివి నచో మన "కామదహనము," ఊరేగింపులు, వేషభూషలు నాట్యము మొదలైనవి స్మరణకు వచ్చును. శివుడు ప్రాచీన దేవత. లింగపూజ హరప్పా, మొహెంజొదారోల కాలమునాటికే ప్రాచుర్య మున నుండినది ఈ డయోనిసెస్ దేవత గ్రీసునకు తూర్పు దేశమునుండి వచ్చెనని కొందరు పాశ్చాత్య విద్వాంసులు చెప్పు

చున్నారు. (కేంబ్రిడ్జి ఇండియన్ హిస్టరీ వాల్యూం : 1. పుటలు 419, 422, 485 )

భరతుని నాట్యశాస్త్రము చివర నహుషుని ప్రార్థన కలదు. అతని ప్రార్థన ననుసరించి భరత పుత్రులు భూలోకమునకు వచ్చి, ఆయన ఆస్థానమున నాట్యమాడి, కొంతకాల మచటనుండి తమ విద్యను భూలోకమున ప్రతిష్ఠించి వెళ్ళిరని చెప్పబడినది ఆ నహుషుడే యయాతితండ్రియై యుండునా ? యని కొందఱు శంకించిరి. (ఏషియాటిక్ రిసర్చి వా. 3.) ఈ కారణములను పురస్కరించు కొని సంస్కృత నాటకము భారతీయార్య సంస్కృతి యందేపుట్టి కాలానుగుణ్యముగా మార్పులనంది, అభివృద్ధి చెందిన దనవచ్చును ఎవ్వ రేమన్నను భరతుని నాట్యశాస్త్రము నాట్యలక్షణములను వివరించు తక్కిన అన్ని గ్రంథముల కంటె ప్రాచీన తమ మనియు, సర్వోత్కృష్టమనియు, అన్నిటికిని మూలాధారమనియు చెప్పుటలో బాధకము లేదు.

ఈ నాట్యశాస్త్రమున కభినవగుప్తుడు "అభినవ భారతీ వ్యాఖ్యానము"ను వ్రాసి దానిని సర్వాంగ సుందర మొనరించెను. దాని తరువాత ధనంజయుని "దశరూపకము", శారదా తనయుని "భావప్రకాశము", విద్యానాథుని "ప్రతాపరుద్రీయము", సింగ భూపాలుని "రసార్ణవ సుధాకరము", విశ్వనాథుని "సాహిత్య-దర్పణము" మొదలైన లక్షణ గ్రంథములు వెలువడినవి. ఇట్లుత్తమ లక్షణములతో విశ్వజనీనమైన సంస్కృత నాటకోత్పత్తి యెన్నడో జరిగియున్నను మనకు పతంజలి "మహాభాష్యము"న ప్రస్తావింప

బడిన "కంసవధ", "బలిబంధము"లను నాటకములే మొట్టమొదటి నాటకములై యుండుట విచిత్రము

రూపక వికాసము :

తాళ, లయ, గీత, వాద్యాభినయాదులతో నారంభమై సంగీతమునకు దోడు సంవాదమును జేర్చుకొని, పాత్రలను బెంచి కథావస్తువునకు ప్రాధాన్య మొసగి ప్రదర్శింపరాని, ప్రదర్శింప వీలులేని విషయములను "ప్రవేశక", "విష్కంభా"దుల రూపమున దెలిపి పాత్రపోషణము జేయుచు క్రమముగా మన్నత స్థాయి నందుకొని నాటకము సర్వాంగ సుందరముగ రూపొందినది. ఈ పరిణామములో "నాటకీయత" అనగా వ్యక్తుల సంభాషణ, పాత్రలలో మానవ స్వభావచిత్రణము, దృశ్యమునకు ప్రాధాన్యము, శ్రవ్యమునకు ప్రాధాన్యము బలపడి ఇప్పటి నాటకాకృతి యేర్పడిన దని చెప్పవచ్చును ఆదినుండి అంతము వరకు నొకే దృశ్యము గాక విరామమునకై వస్తువిభాగము ననుసరించి అక్కడి కక్కడికే "అంకములు" - ఒకటి, రెండు, అయిదు, ఏడు, పది, వరకు బెరిగి సారస్యమైన నాటక కథను దృశ్యము తరువాత దృశ్యముగా ప్రదర్శించుచు పరిణామ ప్రాయముగా నుత్తమ ఫలప్రాప్తితో నాటకము ముగియును.

ఉదాత్త వస్తువునకు రాగతాళాభినయ సమ్మేళనము కలుగుట వలన సహజముగా ఛందస్సు నందలి లయకు ప్రాధాన్య మొసంగబడి తరువాత పరిణామ క్రమముగ లోకసహజమైన

గద్యమునకు, ఛందోబద్ధమైన గద్యమునకు నాటకమున నుచిత స్థానము లభించియుండునని భావించవచ్చును.

నాటకము మొట్టమొదట సంప్రదాయ ధర్మముల ఆవరణమునందు పెరుగుట వలన ధార్మిక విశ్వాసములను, దేవతల, మహాపురుషుల కథలను ఆశ్రయించినది ఇది మనకే గాక గ్రీకు మొదలగు పాశ్చాత్య దేశీయులకు గూడ తెలిసిన విషయము మనకు శంకర, రామ, కృష్ణ మహాభారత నాయకాదులు కథనాయకులైనట్లే గ్రీకులకు గూడ "డయోనిసెస్," "ప్రొమేథియస్," "యూలిసిస్," "అగమెమ్నాన్" మొదలైన వారు కథానాయకులయి యున్నారు. వారి సుఖ దుఃఖములు, మహాత్మ్యములు, ఆటపాటలు, మాటలు ఉదాత్తముగ చిత్రించబడినవి. వీనితో పాటు నామదహనోత్సవములలో పల్లీల పూరితములై, స్త్రీ పురుష సంభోగ కథాపూర్ణములైయున్న నాటకములుగూడ దేవతాప్రీతి నుద్దేశించి, జనుల శ్రేయస్సంతోషములను గోరి రచింపబడినవి ఈ సంయోగ వ్రతానుభవము లేనిదే లోకమున సృష్టిలేదు; పైరు పెరుగదు; వృక్షము ఫలము నీదు; స్త్రీలు ప్రసవింపరు; పురుషులు సంతాన ప్రాప్తినంది స్వర్గమునకు పోరు.

కాలాంతరమున మానవుని సభ్యత పెరుగుచున్న కొలది బుద్ధి వికాస, జ్ఞాన విస్తారములు హెచ్చి జీవన చరిత్రలను, మహావీరుల యుదాత్తగుణములను సహజ సుందరములుగ ప్రదర్శించు పద్ధతు లేర్పడెను. నాటకాకృతి మారెను నాటక రీతి, నాటకాత్మ మారెను. పురాణ కథలు వెనుక బట్టెను లేదా హాస్యము పాల

య్యెను కవుల కల్పనాప్రపంచము విస్తరించెను హాస్య, శృంగారముల యాకర్షణ మెక్కువయ్యెను. ప్రకరణములు, ప్రహసనములు, భాణములు ప్రబలెను. పురాణ కథలకు బదులు "బృహత్కథ" వంటి ప్రసిద్ధ కథా సంగ్రహములు, కల్పిత గాథలు నాటక వస్తువులయ్యెను.

ఉత్తమ నాటకముల సృష్టిని తత్వజ్ఞులు, రసజ్ఞులు పరిశీలించి లక్షణముల నిరూపించిరి వానిలో గొన్ని విశ్వజనీనములు, కొన్ని సామాన్యములు నై యున్నవి మహాకవులు పుట్టి సామాన్య నియమముల నుల్లంఘించి స్థల, కాల, కార్యముల కైక్యమును ప్రతిపాదించిరి వివిధ భేదములు: నాటక, త్రోటక, నాటికా, సట్టక, రూపక, రూపికాదులపేర బెరిగి ప్రత్యేక లక్షణముల నందినవి. నాయికా నాయక భేదములు, నాంది, విష్కంభ, భరత వాక్యాదులు, పాత్రోచిత భాష, రసోచిత ఛ్చందస్సు, రసభావాను భావాదులు అను అనంత విషయములతో, వానివాని లక్షణములతో నాటక మొక మహారూపమును పొందినది.

## రూపక భేదములు :

నాట్యము దృశ్యమాన మగుటచే రూపమనబడును. రూపము యొక్క ఆరోపము కలదగుటవలన నది రూపక మగును అది పది విధములు. భరతాదులు రూపకములు పది విధములని నిర్ణయించి వాని వాని లక్షణములను వివరించిరి. 1. నాటకము 2. ప్రకరణము 3. భాణము 4. ప్రహసనము 5. డిమము

6. వ్యాయోగము 7. సమవకారము 8 వీథి 9 అంకము 10. ఈహామృగములి³

*1. నాటకము :—* ఇందలి వస్తువు ప్రఖ్యాతము. వృద్ధి, విలాస, సుఖదుఃఖములుండును. అయిదు సంధులు, అయిదు మొదలు పదివరకు అంకములు ఉండును ఇందలి నాయకుడు ధీరోదాత్తుడు రాజర్షి, దివ్యుడు లేక దివ్యాదివ్యుడు కావలెను. ఇతనికి సహచరులుగ నుండు ముఖ్య పురుష వ్యక్తులు నలుగురో, అయిదుగురో ఉందురు శృంగార, వీర రసములు ప్రధానములై తక్కిన రసములు వాని కంగములుగ నుండి చివర కద్భుత రసముతో కూడి యుండవలెను ఈ పద్ధతి గోపుచ్ఛాకృతి (సూక్ష్మముగ నారంభమై, విస్తరించి తరువాత నేకముఖముగ సూక్ష్మకృతితో ముగియుట) లోనుండ వలెను నానా సంవిధానములతో గూడి నాయకుడు, అతని పత్ని, మంత్రి మొదలైనవారి రసవంతమైన ప్రత్యక్ష చరిత్ర నిది కలిగియుండును శబ్దార్థములు స్పష్టములై గద్యములు, వాక్యములు చిన్నవై, పద్యములు తక్కువై యుండును ప్రతిఅంకము కథాజీవనమునకు సంబంధించి దానిని విస్తరించు చుండును అది పెద్దది కారాదు (అంకము). అందులో కొన్ని దినములు నడుచు కథ యుండరాదు. సాధారణముగా నాయకుడు ముగ్గురు, నలుగురు పాత్రలతో గనబడవలెను అంకాంతమున పాత్రలన్నియు విష్క్రమించును.

---

3. శ్లో. నాటకం సప్రకరణం, భాణః ప్రహసనం డిమః ।
వ్యాయోగ సమవకారౌ వీథ్యంకేహామృగాఇతి. (ద.రూ. 1-8)

ఉదాహరణకు:— శాకుంతలము, ముద్రారాక్షసము మొదలైనవి.

నాటకము ప్రకృతి; తక్కిన రూపకములన్నియు దానికి వికృతులు.

*2. ప్రకరణము* :—ఇందలి వస్తువు లౌకికము, కల్పితము. ప్రధానరసము శృంగారము నాయకుడు బ్రాహ్మణుడుగాని, మంత్రిగాని వర్తకుడుగాని కావచ్చును అతడు ధీరశాంతుడు. ధర్మకామార్థ పరుడునై యుండును. ఆతని యాస్తి నశించును నాయిక కులస్త్రీకాని, వేశ్యకానికావచ్చును ఒక్కొక్కసమయమున నిద్దరును ఉండుట కలదు. ఇందు విట, చేట ద్యూతక, కితవులుందురు. తక్కిన యంశములు నాటకమునకు వలెనె.

ఉదాహరణము:— మాలతీ మాధవము, మృచ్ఛకటిక.

*3. భాణము* :— ఇందలి వస్తువు ఉత్పాద్యము. ధూర్త చరితము ఒక అంకముండును కుశలుడు, పండితుడు అయిన విటు డొకడే పాత్ర. అతడాకాశ భాషితము ద్వారా తనవి, ఇతరులవి యనుభవములను దెలుపుచుండును. శౌర్య, సౌభాగ్య వర్ణనలతో ముఖ, నిర్వహణ సంధులును, పది లాస్యాంగములును, భారతీ వృత్తియు నుండును.

ఉదాహరణము:— లీలా మధుకరము.

*4. ప్రహసనము*:— వస్తువు కల్పితము. గ్రామికజనుల చరిత్రమై యుండును. హాస్యము ప్రధానరసము సంధి సంధ్యంగ, లాస్యాంగ, అంకములు భాణమున నున్నటే. వీధి అంగములును

ఉండుట గలదు. ఆరభటీ వృత్తి. విష్కంభ, ప్రవేశికలు ఉండవు. ప్రహసనము శుద్ధమని, సంకీర్ణమని, వికృతమని మూడు విధములు.

శుద్ధమున తపస్వికాని, బ్రాహ్మణుడుగాని, గురువుగాని నాయకులై యుందురు. సంకీర్ణమున భ్రష్టులైన బహుజనుల చరిత్ర యుండును. వికృతమున షండ, కంచుకి, తాపసి, విట, భటాదు లుందురు.

*ఉదా :* కందర్పకేళి, ధూర్తచరితము, లటకమేలకము

***5. డిమము :*** వస్తువు ప్రఖ్యాతము. మాయా, ఇంద్రజాల, యుద్ధాదులతో నిండియుండును. ప్రధాన రసము రౌద్రము తక్కిన రసములలో శాంత, హాస్య, శృంగారము లుండరాదు నాలుగంకము లుండును. విష్కంభ ప్రవేశిక లుండును నాయకులు ఉద్ధతులు, దేవగంధర్వ రాక్షసాదులలోనివారు పదునాల్గు రుందురు. కైశికీవృత్తి, విమర్శ సంధి యుండవు.

*ఉదా :* త్రిపుర దాహము.

***6. వ్యాయోగము :*** వస్తువు ప్రఖ్యాతము. స్త్రీ నిమిత్తము గాని కలహము స్త్రీ పాత్రలు తక్కువ. పురుషపాత్ర లెక్కువ. గర్భవిమర్శ సంధులుండవు. ఒకే అంకము. ప్రఖ్యాతుడు, ధీరోద్ధతుడునైన నాయకుడు. అతడు రాజర్షికాని దివ్యుడు కావచ్చును. కైశికీ వృత్తిలేదు. హాస్య, శృంగార, శాంతములు దప్ప తక్కినవి ప్రధాన రసములు గావచ్చును.

*ఉదా :* సౌగంధికాహరణము.

*7. సమవకారము* : ఇందలి వస్తువు ప్రఖ్యాతము. దేవాసురులకు సంబంధించినది. విమర్శ సంధిలేదు మూడంకము లుండును. మొదటి యంకమున రెండు, తక్కిన వానిలో నొక్కొక్కటిగ సంధులుండును ప్రఖ్యాతులు. ఉదాత్తులునైన పండ్రెండుగురు దేవమానవులు నాయకులు అందరికిని ప్రత్యేక ఫలములు. ప్రధాన రసము వీరము కైశికీవృత్తి అరుదుగ వచ్చును. బిందు. ప్రవేశికము లుండవు గాయత్రీ ఉష్ణిక్ మొదలైన వివిధ చ్ఛందస్సు లుండును ఇందు శృంగారత్రయము (ధర్మ. అర్థ. కామము). కపటత్రయము (స్వాభావిక. కృత్రిమ. దైవజములు). విద్రవత్రయము (అచేతన చేతన. చేతనా చేతన కృతములు), వీధి. అంగములలో వీలైనన్నియు నుండును. మొదటి యంకములోని కధ 24 గడియలలోను. రెండు మూడంకములలోనివి 8, 4 గడియలలోను జరుగును.

ఉదా:— సముద్రమధనము

*8. వీథి* : దీనిలో నొకే యంకముండును ఒకే నాయకుడు ఆకాశ భాషితములతో చమత్కారముగ ఉక్తి. ప్రత్యుక్తులను సాగించును. శృంగార మెక్కువగ తక్కిన రసములు తక్కువగ సూచింపఁబడును ముఖ నిర్వహణ సంధులును, అన్ని అర్థప్రకృతులును. పదుమూడు వీథ్యంగములును ఉండును ఈ యంగములు వివరింపఁబడుచున్నవి.

**వీథ్యంగములు :**

(1) ఉద్ఘాతకము:—ప్రశ్నరూపకములైన పదములకు వాని పర్యాయ పదములతో సమాధానము చెప్పుట.

(2) అవలగితము:— ఒక విధమైన ప్రశ్న కీయబడిన యుత్తరము మఱియొక అర్థమును సాధించుట.

(3) ప్రపంచము:— అసత్యములు, పరస్పర స్తోత్రయుతములు, హాస్యజనకములు నగు సమాధానము లొసగుట.

(4) త్రిగతము:— ఒకే సమాధానమునకు శబ్దసామ్యముచేత అనేకర్థములు తోచుట.

(5) ఛలము:— మరొక ప్రయోజనము నుద్దేశించిన సమాధానము ఒకరికి రోషమును, వేరొకరికి హాస్యమును, మరొకరికి అభిసంధిని కలిగించుట.

(6) వాక్కేలి;— అనేక ప్రశ్నలకు ఏక సమాధానమొసగుట.

(7) అధిబలము:— స్వపక్షబలమును సాధించుటకు ఉక్తి ప్రత్యుక్తులు జరుపుట.

(8) గండము:— ఆవేగము, వివాదము, అపవాదము అనువానిచే ముగియని సమాధాన మొసగుట.

(9) అవస్యందితము:— ఉన్న అర్థమును కప్పిపుచ్చి మరొక అర్థము వచ్చునట్లు సమాధాన మొసగుట.

(10) నాళిక:— పరులను వంచించునట్టి హాస్యయుక్త సమాధానము.

(11) అసత్ప్రలాపము:— హితమైన సమాధానమును మూర్ఖతచే వినక పోవుట.

(12) వ్యాహారము:— ఎప్పుడో తెలియబోవు అర్థమును ఇప్పుడే స్ఫురింపజేయుట

(13) మృదవము:— కథలో గుణములను దోషములుగ, దోషములను గుణములుగ నిరూపించునట్టి సమాధానములు చెప్పుట.

వీథికి ఉదాహరణము : మాలవికా.

*9 అంకము* : దీనికి ఉత్సృష్టికాంక మనియు పేరు. ఇందలి వస్తువు ప్రఖ్యాతము. కవి కల్పనచే బెరుగును. ఒకే అంకము. నాయకులు చాతుర్యములేని పలువురు. ప్రధాన రసము కరుణము. అనేక స్త్రీలు శోకింతురు. సంధి వృత్తి అంగాదులు భాణమునకు వలెనే. ఇందు జయాపజయములు, వైరాగ్య విచారములు వచ్చును. యుద్ధము మాటలతోనే వర్ణింపబడును.

ఉదా : శర్మిష్ఠాయయాతి.

*10 ఈహామృగము* : వస్తువు మిశ్రము. అంకములు నాలుగు. ముఖ ప్రతిముఖ, నిర్వహణ సంధు లుండును. ప్రఖ్యాతులు, ధీరోద్ధతులు అయిన నరదివ్యులు, దివ్యనరులు ప్రతినాయకులై యుందురు. దివ్యస్త్రీ నిమిత్తముగా యుద్ధములు కలిగి నివా

రితములగును. పదుగురు దివ్యపురుషులు నాయకులుగ నుందురు. ఈ రూపకమును గూర్చి మత భేదము లున్నవి

ఉదా : కుసుమ శేఖర విజయము.

ఉపరూపకములు—సాహిత్య దర్పణకారాదులు పదునెనిమిది విధములైన ఉపరూపకములను నిర్వచించిరి. ఇతరులుప రూపకముగ పరిగణించు నాటికను దశరూపకకారుడు నాటక "ప్రకరణ"ములో చెప్పెను.

——

# ద్వితీయ ప్రకాశము

## రూపక తత్త్వములు :

ఈ యధ్యాయమున నాటకమునకు సంబంధించిన యంశములు వర్ణింపబడుచున్నవి. రూపకముల వర్గీకరణము మూడు ముఖ్య తత్త్వములపై నాధారపడి యుండును. అవి వస్తువు, నాయకాదులు, రసములు[4].

## 1. వస్తువు :

వస్తువు అనగా నాటకమున నుండవలసిన కథాభాగము. దీనిని ఇతివృత్తమనియు నందురు ఈ వస్తువు "ఆధికారికమని" "ప్రాసంగిక" మని రెండు విధములు.

*1. ఆధికారిక మనగా*, నాటకము ముగియు వరకు వచ్చు ప్రధాన కథ.

ఉదా ; శాకుంతల నాటకమునందు శకుంతలా దుష్యంతుల వృత్తాంతము.

*2. ప్రాసంగిక మనగా* : ముఖ్యకథకు అంగముగ నడుమ వచ్చుకథ

ఉదా : మేనక శకుంతలను గొనిపోయి మారీచాశ్రమమున వదలగా నచట సర్వదమనుడు పుట్టి పెరిగిన విషయము.

---

4. శ్లో. వస్తునేతా రసస్తేషాం భేదకో వస్తుచద్విధా (ద రూ. 1-11)

ప్రాసంగికము ఈ విధముగ పెద్దదయినచో "పతాక" యనియు, సన్నదైనచో-(బెస్తవారి వృత్తాంతము) 'ప్రకరి' అనియు చెప్పబడును.

ఆధికారిక వస్తువు "ప్రఖ్యాతము", "ఉత్పాద్యము" "మిశ్రము" అని మూడు విధములు.

(1) ప్రఖ్యాత మనగా : రామాయణ, భారత, కథాసరిత్సాగరాది సుప్రసిద్ధ గ్రంథములనుండి గ్రహింపబడినది.

(2) ఉత్పాద్య మనగా కేవల కవి కల్పితము.

(3) మిశ్రమ మనగా : ప్రసిద్ధ కథ యందు కొంత కవి కల్పనము చేరియుండునది

## ఇతివృత్త ఫలము :

కథ యెటువంటి దైనను కవి సాధారణముగా ప్రతి కాకలోను ఒక ప్రధాన ఫలము నుద్దేశించును అనగా-ధర్మార్థధమములలో నేదో యొకదానిని ముఖ్యముగా సాధింపవలెనను లక్ష్యము కలిగియుండును. తక్కిన రెండింటిలో ఒకటిగాని, రెండుసుగాని అనుషంగికములై యుండవచ్చును

## అర్థ ప్రకృతులు :

కథను విస్తరింపజేయు దృష్టితో మనకు వస్తువునందు అయిదంశములు కానవచ్చును వానికి "అర్థప్రకృతు"లని పేరు. 1 బీజము, 2. బిందువు, 3. పతాక, 4 ప్రకరి, 5. కార్యము[6]

---

5. కార్యం త్రివర్గస్తచ్ఛుద్ధం యేకానేకానుబంధిచ.

6. బీజబిందు పతాకాఖ్య ప్రకరీకార్య లక్షణాః అర్థప్రకృతయః పంచ ఏతాః పరికీర్తితాః (ద. రూ. 1-18):... ... ...

*1. బీజము* : కథకు మూలభూతమైన ఘటనను సూచించుట.

*2. బిందువు* : బీజరూపమైన ఘటనమును పెంచుట.

*3. పతాక* : కథామధ్యమున వచ్చు ఉపకథ

*4. ప్రకరి* : ప్రాసంగికముగ వచ్చిన చిన్న కథ

*5. కార్యము* : కథాపరిణామము అనగా ఫలము.

అవస్థా పంచకము :

నాయకుని కార్యసాధన దృష్టితో వస్తువునందు అయిదు స్థితులుండును వానికి "అవస్థ"లని పేరు7. 1. ఆరంభము, 2 యత్నము, 3. ప్రాప్త్యాశ, 4. నియతాప్తి, 5 ఫలాగమము అనునవి.

*1. ఆరంభము* : ముఖ్య కార్యసాధనమునందు నాయకాదులకు కలుగు ఔత్సుక్యము.

*2. యత్నము* : ఆటంకములు కలుగుచుండగా వానిని నివారించుకొనుచు, కార్యసాధనకు నాయకులుచేయు ప్రయత్నము.

*3. ప్రాప్త్యాశ* : సాధనోపాయములు, ఆటంకములు రెండును ఉండుట వలన ఫలప్రాప్తికి సంభవము.

*4. నియతాప్తి* : ఆటంకములు నివారింపబడి ఫలప్రాప్తి నిశ్చయముగ కలుగునన్న విశ్వాసము.

---

7. అవస్థాః పంచకార్యస్య ప్రారబ్ధస్యఫలార్థిభిః. ఆరంభ. యత్న ప్రాప్త్యాశానియతాప్తి ఫలాగమాః ॥ (ద. రూ. 1-19)

*5. ఫలాగమము* : ఉద్దేశించిన ఫలము సమగ్రముగ ప్రాప్తించుట.

సంధి పంచకము :

పైన చెప్పిన అయిదర్థ ప్రకృతులును, అయిదవస్థలును క్రమముగాఁ జేరినచో వస్తువునందు. 1. ముఖ, 2. ప్రతిముఖ, 3. గర్భ, 4. అవమర్శ, 5. ఉపసంహృతి (నిర్వహణ) అను పంచ సంధు లేర్పడును[8].

*1. ముఖసంధి* : దీని యారంభములో కథ యింకను బీజ రూపమున నుండును నాయకుడు తన కార్యము నారంభించును.

ఈ ముఖసంధికి పండ్రెండంగములుండును ఉపక్షేపము, పరికరము, పరిన్యాసము, విలోభనము. యుక్తి, ప్రాప్తి, సమాధానము, విధానము, పరిభావన, ఉద్భేదము, కరణము, భేదము అనునవి. వీని లక్షణము లిట్లుండును.

(1) ఉపక్షేపము:— కావ్యార్థమును ప్రయోజన పరముగ సంగ్రహముగ సూచన మొనరించుట.

(2) పరికరము:— పై విధముగ సూచితమైన దానిని కొంత విస్తరించుట.

---

8. అర్థప్రకృతయః పంచ పంచావస్థా సమన్వితాః యథాసంఖ్యేన
జాయంతే ముఖాద్యాః పంచసంధయః.......ముఖ ప్రతిముఖేగర్భః
సావమర్శోప సంహృతిః॥ (ద. రూ. 1-22, 23, 24)

(3) పరిన్యాసము:—కావ్యార్థమును స్పష్టముగ నిర్దేశించుట

(4) విలోభనము:— గుణములను వర్ణించుట

(5) యుక్తి:— కర్తవ్యతా నిశ్చయము.

(6) ప్రాప్తి:— సుఖము గలిగించు వస్తువు లభించుట.

(7) సమాధానము:— బీజార్థము ప్రధాన నాయకానుగతముగ సూచింపబడుట.

(8) విధానము:— సుఖ దుఃఖములు కూడియున్నట్లు వర్ణింపబడుట

(9) పరిభావన:— ఎక్కువ కుతూహలముతో గూడిన ఆవేగమును వర్ణించుట.

(10) ఉద్భేదము:— బీజోత్పత్తిని వర్ణించుట

(11) కరణము:— ప్రకృతార్థమును ప్రారంభించుట.

(12) భేదము:— పాత్రలు తమ ప్రయోజనమును నిర్వహించుటకు నిష్క్రమించుటకై విడివడుట.

2. *ప్రతిముఖసంధి* : దీనియందు కథ మఱికొంత పెరుగును. నాయకుడు కార్యసాధనకై యత్నించును దీనికి 13 అంగము లుండును విలాసము, పరిసర్పము, విధూనము, తాపనము, నర్మము, నర్మద్యుతి, ప్రగమనము, విరోధము, పర్యుపాసనము పుష్పము, వజ్రము, ఉపన్యాసము, వర్ణసంహారము అనునవి వాని లక్షణము లిట్లు.

(1) విలాసము:— రతిభోగార్థమైన కోరిక.

(2) పరిసర్పము :— కనబడి అంతలో మఱుగైన అంశము ననుసరించుట

(3) విధూనము:— ప్రతిమాలుకొనుచుండగా మొదట వినకుండుట

(4) తాపనము:— అపాయమును చూచుట.

(5) నర్మము: — క్రీడార్థము చేసిన హాస్యము.

(6) నర్మద్యుతి:— దోషమును మఱుగుపఱచుటకు చేయు హాస్యము.

(7) ప్రగమనము:—ఉక్తిప్రత్యుక్తి రూపమగు వాక్యము

(8) నిరోధము:— వ్యసనప్రాప్తి.

(9) పర్యుపాసనము:— కోపగించినవాని నూఱడించుట

(10) పుష్పము: — విశేష వచనము.

(11) వజ్రము: — ప్రత్యక్ష పరుషవాక్యము

(12) ఉపన్యాసము: — ఉపపత్తులచే నొక యర్థమును సమర్థించుట

(13) వర్ణసంహారము:— వివిధ పాత్రల కలయిక.

*3. గర్భసంధి* : దీనిలో కార్యఫలము ప్రాప్తించు సూచన కనబడును.

దీనికి 12 అంగము లుండును అభూతాహరణము, మార్గము రూపము ఉదాహరణము, క్రమము, సంగ్రహము అనుమానము, అధిబలము. తోటకము. ఉద్వేగము, సంభ్రమము, ఆక్షేపము.

(1) అభూతాహరణము:-— కపటముతో గూడిన వాక్యము

(2) మార్గము:--- తత్వమును చెప్పు వచనము

(3) రూపము: — విచిత్రార్థములను సంభావించి వితర్కించుట.

(4) ఉదాహరణము:-— ఉత్కర్షతో గూడిన వాక్యము.

(5) క్రమము:— భావనా బలమున పరమార్థమును గ్రహించుట.

(6) సంగ్రహము: —సామ దానాదులతో కూడి యుండుట

(7) అనుమానము:— ప్రత్యక్ష రూపమునుబట్టి దానిని పోలిన మరొక దానిని భావించుట

(8) అధిబలము.— కపటమున వంచించుట.

(9) తోటకము: — ఆవేగముతో కూడిన వచనము

(10) ఉద్వేగము:— రాజ, చోర, శత్రువుల వలన పుట్టిన భయము

(11) సంభ్రమము:—శంకాత్రాసములతోగూడి యుండుట

(12) ఆక్షేపము:— మనసులోని రహస్యము బయలు పడుట.

**4.** *అవమర్శసంధి* :—ఇందు కథ గర్భసంధికంటె కొంత ముందుకు సాగును. నాయకుడు కోప. వ్యసన, విలోభనాదుల నుండి కొంత తట్టుకొని నిలబడును. దీనికి 13 అంగములుకలవు అపవాదము, సంఫేటము, విద్రవము, ద్రవము, శక్తి, ద్యుతి,

ప్రసంగము, ఛలనము, వ్యవసాయము, విరోధనము, ప్రరోచనము, విచలనము, ఆదానము అనునవి

(1) అపవాదము:— దోషమును వెల్లడించుట.

(2) సంఫేటము:— రోషముతో కూడిన వాక్యము.

(3) విద్రవము:— వధ, బంధాములతో గూడినది.

(4) ద్రవము:— గురుధిక్కారము

(5) శక్తి:— కోపించిన విరోధిని శాంతింప జేయుట

(6) ద్యుతి:— తిరస్కారముతో గూడిన వాక్యము.

(7) ప్రసంగము:— గురువులను స్తుతించుట.

(8) ఛలనము: — అవమాన కృతవాక్యము.

(9) వ్యవసాయము:—తెలిసిన ప్రయోజనమును సాధించు హేతువు సిద్ధించుట.

(10) విరోధనము:— కార్యభంగ మగునంత వరకు వచ్చుట.

(11) ప్రరోచనము:— నిర్వహింప వలసిన అర్థమును ముందుగ ప్రదర్శించుట.

(12) విచలనము: — స్వగుణములను కీర్తించుకొనుట.

(12) ఆదానము:— బీజఫలము సన్నిహితమగుట

*5. నిర్వహణసంధి :* దీనియందు ఇంత వరకు నానా ముఖములుగ నుండిన కార్యమంతయు నేకముఖమై మఱియును

నాయకుడుద్దిష్టకార్యఫలమును పొందును ఈ సంధికి 14 అంగము లుండును సంధి, విబోధము, గ్రథనము, నిర్ణయము, పరిభాషణము, ప్రసాదము, ఆనందము, సమయము, కృతి, భాషణము, పూర్వభావము, ఉపగూహనము, కావ్యసంహారము, ప్రశస్తి అనునవి

(1) సంధి: — బీజభూత విషయము ఫలోన్ముఖమగుట.

(2) విబోధము:— ముఖ్యకార్యము నన్వేషించుట

(3) గ్రథనము :— కార్యవిశేషముల నన్నిటి నేకార్థకములుగ కూర్చుట

(4) నిర్ణయము: — అనుభూతమైన అర్థమును తెలియ జెప్పుట.

(5) పరిభాషణము:— పరస్పర సంభాషణము

(6) ప్రసాదము: — కార్యసిద్ధి నెఱిగించి సంతోషపెట్టుట.

(7) ఆనందము:— కోర్కెలు తీరుట.

(8) సమయము:— దుఃఖము తొలగుట

(9) కృతి:— ప్రాప్తించిన యర్థమును కాపాడుకొనుట.

(10) భాషణము:— కార్యము సిద్ధించుట వలన ప్రసంగించుట.

(11) పూర్వభావము: — ఇష్టకార్యమును దర్శించుట.

(12) ఉపగూహనము:— అద్భుతముగా ప్రయోజనము ప్రాప్తించుట.

(13) కావ్యసంహారము .— కావ్యార్థమును సమాప్తి చేయుట. (వరప్రాప్తి).

(14) ప్రశస్తి:— రాజునకు, దేశమునకు శాంతినిగోరుట.

భరత, ధనంజయాదులు చెప్పిన యీ యరువది నాలుగు సంధ్యంగములలో నన్నిటిని ఉపయోగించి తీరవలయునను నియమములేదు. వానిని యథోచితముగ నుపయోగించి రూపక రచన చేసినచో కావలసిన యర్థమును గ్రహింపవచ్చును అనవసరమైన దానిని వదలవచ్చును. పెంచవలసిన దానిని పెంచవచ్చును. రసాభివ్యక్తిచే నానందింపజేయవచ్చును. మొత్తము మీద హృదయంగమ మగునట్లు కథను పెంచి, నాటకమును సంతరించి, అభినయించి, ఆనందము గూర్పవచ్చును.

## సంధ్యంగ ప్రయోజనములు :

పై సంధ్యంగములకు ముఖ్యములైన ఆఱు ప్రయోజనము లున్నవి వివక్షితార్థ ప్రతిపాదనము, గోప్యార్థ గోపనము, ప్రకాశ్యార్థ ప్రకాశసము, అభినయరాగ సంవృద్ధి, చమత్కారిత్వము, ఇతి వృత్తవిస్తరము వాని లక్షణము లిట్లు చెప్పబడుచున్నవి.

*1. వివక్షితార్థ ప్రతిపాదనము :* (ఇష్టార్థరచన) ఇష్టమైన ప్రయోజనమును విస్తరింపఁ జేయుట.

*2. గోప్యార్థగోపనము :* మరుగు పరచవలసిన అర్థములను కప్పిపుచ్చుట.

*3 ప్రకాశ్యార్థ ప్రకాశనము :* వెల్లడింప వలసిన వానిని వెల్లడించుట.

*4. అభినయ రాగసంవృద్ధి:* అభినయమును రక్తిగట్టించుట.

*5. చమత్కారిత్వము :* ఇతివృత్తమును చిత్రముగా నొనర్చుట.

*6. ఇతివృత్త విస్తరము :* ఇతివృత్తమును చక్కగ కొనసాగించుట.

పునర్వస్తు విభాగము :

ఇతి వృత్తము సూచ్యము, అసూచ్యము అని మరల రెండు భాగములు చేయబడినది. అసూచ్యము, దృశ్యశ్రవ్య భేదములతో రెండు విధములు9 సూచ్యమైదు విధములు:— విష్కంభము, చూలిక, అంకాస్యము, అంకావతారము, ప్రవేశకము, అనునవి. వీనిని అర్థోప క్షేపకములందురు.

అర్థోపక్షేపకములు :

నీరసములైన, అనుచితములైన ఇతివృత్త భాగములను అర్థోపక్షేపకములచే సూచింపవలెను. దూరప్రయాణము, హత్య, యుద్ధము, రాజ్యవిప్లవము, ముట్టడి, భోజనము, స్నానము, లేపనము, వస్త్రధారణము, శయనము, మొదలయిన వనుచితములు.

---

9. ద్వేధావిభాగః కర్తవ్యః సర్వస్యాపీహవస్తునః సూచ్యమేవ భవేత్కించిత్ దృశ్య, శ్రవ్యమథాపరమ్ (ద రూ. 1-56)

వీనిని రంగము మీద ప్రత్యక్షముగ జూపరాదు. నాయకుని వధ నెచ్చటగాని వర్ణించుట, సూచించుట కూడ జరుగరాదు. మధుర ములై, ఉదాత్తములై, రసభావ పూర్ణములై యుండు భాగములను మాత్రమే ప్రదర్శింపవలెనని దీని భావము.

విష్కంభాదులు వివరింపబడుచున్నవి.

*1. విష్కంభము :* జరిగిపోయిన కథా భాగమును సంగ్రహముగ సూచించునది. దీనిని ప్రధానపాత్రలు ప్రయోగింపవు ఇది రెండు విధములు: శుద్ధము, మిశ్రము. మధ్యమ పాత్రలు చేయునది శుద్ధవిష్కంభము. మధ్యమ, నీచపాత్రలు కలిసిచేయు నది మిశ్ర విష్కంభము.

*2. చూలిక ;* పాత్రలు రంగముపై ప్రవేశింపక తెర వెనుకనేయుండి, మాటలాడి యేదోయొక సంగతిని సూచించుట.

*3. అంకాస్యము :* ఒక అంకము చివర పాత్రలు నిష్క్రమించునపుడు రాబోవు అంకము మొదట వస్తువిషయమును సూచించుట.

*4. అంకావతారము :* ఒక అంకము చివర నిష్క్రమించు చున్న పాత్రలు సూచించిన విషయముతో తరువాతి యంకము అదేపాత్రలతో ప్రారంభమగుట.

*5. ప్రవేశకము :* జరిగిపోయిన కథాంశమును నీచ పాత్రల తోడనే సూచించుట. ఇది రెండంకముల నడుమనే వచ్చును. విష్కంభమువలె నాటకము మొదటరాదు.

శ్రావ్యాశ్రావ్యములు : వస్తువునందు కొన్ని భాగములు శ్రావ్యములుగ, మరికొన్ని భాగము లశ్రావ్యములుగ నుండును. అట్టి వానిని ప్రకాశ, స్వగత, జనాంతిక, అపవారిత, ఆకాశ భాషితములని వ్యవహరించెదరు.

(1) ప్రకాశము: — అందరు వినదగినది. (శ్రావ్యము)

(2) స్వగతము:— మాటాడుచున్న పాత్రగాక మరొకరు వినరానిది (అశ్రావ్యము).

(3) జనాంతికము: — ఒకరిని చాటుచేసికొని మరియొక రితో మాటలాడుట.

(4) అపవారితము: — వెనుకకు తిరిగి రహస్యము మాటలాడుట.

(5) ఆకాశ భాషితము:— ఏ పాత్ర మాటలాడకున్నను, మాటలు వినినట్లు నటించి "ఏమంటివి? ఇట్లనుచున్నావా?" అని పలుకుచు దానికి సమాధానమిచ్చుట

ప్రయోగము : ప్రయోగమునకు ముఖ్యమైన పూర్వ కర్త వ్యము వివరింప బడుచున్నది. ప్రయోగమున సూత్రధారుడు ముఖ్యుడు. సూత్రమనగా నాటకాది ప్రయోగానుష్ఠానము దీనిని ధరించును గావున సూత్రధారు డనబడును ఇతడు నటీ మారీ షాదులతో ప్రయోగమునకు బూనును.

## రూపకారంభము :

కర్మాచరణకు సంకల్పము ప్రారంభమైనట్లే నాటకమునకు ప్రస్తావన ప్రారంభమగును. ప్రతిపాదింప దగిన యర్థమునకు మార్గమైనది ప్రస్తావన యనబడును ప్రస్తావనారంభమున శుభావహమైన నాందిని కూర్పవలయును అది ఆశీర్వాద, నమస్కార, కథానిర్దేశములలో నేదో యొక రూపమున నుండవలెను. చంద్ర నామాంకితమైన మంగళార్థక పదములతో గూడి యుండవలెను. నాందిని ఎనిమిది, పది, పండ్రెండు పదములతో గూర్పవలెను.

## భారతీవృత్తి :

నాందియైన పిదప సూత్రధారుడు ప్రవేశించి రంగము నలంకరించుటకు భారతీవృత్తి నాశ్రయింపవలెను రూపకమందలి ఈ భారతికిని కైశిక్యాది వృత్తులలోని భారతివృత్తికిని నెట్టి సంబంధము లేదు. ఇదొక విలక్షణశబ్దవృత్తి 10. ఈ భారతీవృత్తికి ప్రరోచన, వీథీ. ప్రహసన, ఆముఖములను నాలుగంగము లున్నవి వీథీప్రహసనములకు ప్రయోగము మృగ్యము.

*1.* ప్రరోచనము : ప్రస్తుతమైన విషయమును ప్రశంసించి సభ్యుల చిత్తవృత్తులను తన కనుకూలము చేసికొనుట దీనిని విస్తరించిగాని సంగ్రహించిగాని ప్రయోగింపవచ్చును.

---

10 "పురుషవిశేష ప్రయోజ్యః సంస్కృత బహులః వాక్ప్రధానః నటాశ్రయోవ్యాపారః భారతీ" (దశరూపక వ్యాఖ్యాత ధనికుడు నిర్వచించెను).

*2.* ఆముఖము . సూత్రధారుడు తాను చేయబోవు కార్యమును గూర్చి చమత్కారముగ నటీమారిషాదులతో ప్రస్తావన చేయుట ఆముఖము. అది "కథోద్ఘాత - ప్రవర్తక - ప్రయోగాతిశయములని మూడు విధములు

(1) కథోద్ఘాతము:— ప్రకృత కథ ననుసరించిన సూత్రధారుని వాక్యమునుగాని అర్థమునుగాని గ్రహించి పాత్రరంగమున ప్రవేశించుట

(2) ప్రవర్తకము:— ప్రస్తావనలోని ఋతువర్ణనము ననుసరించి పాత్ర తనంతతానుగ ప్రవేశించుట.

(3) ప్రయోగాతిశయము:— సూత్రధారుడు స్పష్టముగ సూచించిన తరువాత ఆ పాత్ర ప్రవేశించుట

ఆ ముఖము స్వల్పభేదముతో ప్రస్తావన-స్థాపన అని వ్యవహరింపబడును ఆ ముఖమునకు పై ముఖ్యాంగములే గాక వీథికి చెప్పబడిన పదుమూడును సామాన్యాంగములై యుండును ఇవి యెక్కువగ వీథి యందే కానవచ్చుటవలన వీనికి వీథ్యంగములను ప్రసిద్ధి కలిగినది. పై ప్రశంసలో దేశకాలములు కీర్తింపబడును

ఈ రీతిగా నాముఖము నొనర్చి యనుచరులతో సూత్రధారుడు నిష్క్రమింపగా నతనిచే సూచితములైన పాత్రలు రంగముమీదికివచ్చి వస్తువును విస్తరింప జేయవలెను.

నీరస కథా భాగములను విష్కంభాదులు సూచించును. అసూచ్యమును అంకమున వివరింపవలెను.

అంకము : పుత్రులను లాలించుటకు దండ్రి యంకము వలెనే ఉపలాలనముగోను రసాలంకార వస్తువులకు **ఆధార భూత** మైనది అంకము కాలమును, అవస్థను అనుసరించి అంకచ్ఛేదన మొనరింపవలెను అంకము నందలి వస్తువొక దినమునకు సంబంధించి నట్లుండవలెను ప్రతి అంకమున నాయకుడో నాయికయో ఇద్దరు ముగ్గురు పాత్రలతో కనబడవలెను అంకాంత మున పాత్రలన్నియు నిష్క్రమింపవలెను. ప్రథమాంకమునందే బీజము పూర్తియై బిందువు కొద్దిగా మొదలు కావలెను ఈ విధ ముగా. సంకము రసాలంబమై మనోహరమై సంవిధాన విశేషము గలిగి యుండవలెను. నాటకము నందిట్టి యంకములు అయిదు మొదలు పదివరకు నుండవచ్చును.

**అంకచ్ఛేదము** : నాటక మైదంకములదైనచో నొక్కొక్క అవస్థ నొక్కొక్క అంకమున నిబంధించవలెను.

| I అంకములు | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| అవస్థలు | ఆరంభ | ప్రయత్న | ప్రాప్త్యాశ | నియతాప్తి | ఫలాగమములు. |

II ఆరంకములైనచో మొదటి అవస్థను రెండు భాగములుచేసి 1-2 అంకములలో గూర్పవలెను.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| ఆరంభ | ఆరంభ | ప్రయత్న | ప్రాప్త్యాశ | నియతాప్తి | ఫలాగమములు |

II పది యంకములైనచో నొక్కొక్క యవస్థను రెండేసి యంకములలో వాడవలెను

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| ఆరంభ | ఆరంభ | ప్రయత్న | ప్రయత్న | ప్రాప్త్యాశ | ప్రాప్త్యాశ |

| 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|
| నియతాప్తి | నియతాప్తి | ఫలాగమ | ఫలాగమములు |

IV నాలుగంకములైనచో మొదటి యంకమున రెండవస్థలను గూర్చవలెను

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| ఆరంభ | ప్రయత్న | ప్రాప్త్యాశ | నియతాప్తి ఫలాగమములు. |

ఈ లక్షణములతో గూడిన నాట్యము ధర్మార్థసాధనము; అది సమస్తదుఃఖములను పోగొట్టి సకల కల్యాణములను గూర్చును

# తృతీయ ప్రకాశము

## 2. నాయకులు :

రూపకమునందు వస్తువు తరువాత నాయకునకు అధికమైన స్థానము కలదు. నాయకుడు దిగువ వ్రాసిన లక్షణములు గలిగి యుండవలెను నాయకుడు వినీతుడు, మధురుడు, త్యాగి, దక్షుడు, ప్రియంవదుడు, రక్తలోకుడు, శుచిర్వాగ్మి, వాగ్మి, రూఢవంశుడు, స్థిరుడు, యువకుడు, బుద్ధిమంతుడు, ఉత్సాహవంతుడు, స్మృతివంతుడు, ప్రజ్ఞావంతుడు, కలాసమన్వితుడు, మానసమన్వితుడు, శూరుడు, దృఢుడు, తేజస్వి, శాస్త్రచక్షువు, ధార్మికుడునై యుండవలెను. ఇవి నాయక సామాన్య లక్షణములు. నాయకులలో ముఖ్యముగ 1 ధీరోదాత్త 2. ధీరలలిత 3. ధీరోద్ధత 4. ధీరశాంతులను నాలుగు భేదములున్నవి. వాని లక్షణములు చెప్పబడు చున్నవి

*1. ధీరోదాత్తుడు :* సుఖ దుఃఖములకు చలింపని మహాసత్వుడు. గాంభీర్య క్షమలు గలవాడు. ఆత్మస్తుతి పరాఙ్ముఖుడు, స్థిరుడు, వినయముతో గూడిన ఆత్మవిశ్వాసము గలవాడు. కార్యదక్షుడు అయియుండును.

ఉదా ; దుష్యంతుడు, హరిశ్చంద్రుడు.

*2. ధీరలలితుడు*: మృదుస్వభావము, సంగీత సాహిత్యము లందాసక్తి, నిర్వికారముగ సుఖముగ గడుపు కోరికలు గలవాడు.

ఉదా : వత్సరాజు.

*3. ధీరోద్ధతుడు :* దర్పమాత్సర్యములు, మాయావంచనలు, రౌద్రచాంచల్యములు, అహంకార ఆత్మశ్లాఘనములు కలవాడు

ఉదా : దుర్యోధనుడు, రావణుడు (సామాన్యముగ ప్రతి నాయకులు ధీరోద్ధతులుగ నుందురు)

*4. ధీరశాంతుడు :* ఇతనిలో ప్రత్యేక విశిష్ట గుణములుండవు నాయక సామాన్య లక్షణములే ఇతని గుణములు. ఇతడు సాధారణముగ బ్రాహ్మణుడుగాని, వైశ్యుడుగాని అయియుండును. ఉదా : చారుదత్తుడు, మాధవుడు.

పైఁ జెప్పబడిన ధీరోదాత్తాది నాయకు లన్నిరసములకును సాధారణులు, శృంగార రస విషయమున వీరు మూడు విధములుగా నుందురు.

## శృంగార నాయకులు :

పతి, ఉపపతి, వైశికుడు అని శృంగారనాయకులు మూడు విధములు

*1. పతి :* ప్రవృత్తి ననుసరించి ఈ పతి దక్షిణుడు, ధృష్టుడు, అనుకూలుడు; శఠుడునవి నాల్గు విధములుగ నుండును.

(1) దక్షిణుడు:— అనేక పత్నులను కలిగి అందరి యందు నొకే విధమైన ప్రేమగలవాడు.

(2) ధృష్టుడు:— తన భార్య కపచారముచేసి దోషము స్పష్టముగ కనబడుచుండగా ఆక్షేపణలకు గురియగు చున్నప్పటికి సిగ్గుపడనివాడు

(3) అనుకూలుడు:— ఒకే నాయికయం దనురక్తుడై యుండువాడు.

(4) శఠుడు:— బహునాయికలయందు సమాన ప్రేమను నటించి లోలోపల నొక్కతె నెక్కువగ ప్రేమించువాడు.

2. *ఉపపతి :* యథావిధిగ పరిణయము చేసికొన్న కాంత కుల మర్యాద నతిక్రమించి సంకేతమునకు తీసికొని పోగా వెళ్ళువాడు.

3. *వైశికుడు :* సకల సుగుణములు కలిగి వేశ్యల నుప భోగించుటలో రసికత్వమును గనబరచువాడు.

ఈ అన్ని తెగల నాయకులలోను ఉత్తమ, మధ్యమ, అధమ భేదము లుండును. నాయకుడు ఆరంభమునుండి అంతము వరకు నొకే తెగకు చెందినవాడై యుండవలెను. ఒకే నాయకుడు అవస్థా భేదములను బట్టి అనేక నాయకులుగ కనబడవచ్చును. ఒక కథయందే నాయకులు మార్చబడినచో రసాభాసమగును.

జాతులను పురస్కరించుకొని నాయకులు దివ్యులు, అదివ్యులు, దివ్యాదివ్యులు నని మూడు తెగలవారున్నారు. వీరికి శంకరాదులు, అర్జునాదులు, కృష్ణాదులు తార్కాణము

## నాయక సాత్విక భావములు :

శోభా, విలాస, మాధుర్య, స్థైర్య, తేజో, లలిత, ఔదార్యములు నాయక సాత్విక భావము లనబడును

పురుష సంబంధములైన సాత్విక భావము లిట్లుండును.

*1. శోభ :* నీచుని యందసహ్యము, గుణాధికులతో స్పర్ధ, శౌర్యము, ఉత్సాహము, దక్షత ఎచట ప్రకటింపబడునో దానిని శోభ అందురు.

*2. విలాసము :* వృషభమునకు గలట్టి గంభీరగతి, ధీరమైన చూపు, చిఱునవ్వుతో గూడిన మాట గలుగుట విలాసము.

*3. మాధుర్యము :* చేష్టను, దృష్టిని, స్పృహింపజేయుట.

*4. స్థైర్యము :* ఫల ప్రాప్తివరకు ప్రయత్నించుట

*5. తేజము :* తిరస్కారాదులను సహింపకుండుట

*6. లలితము :* శృంగార ప్రచురమైన చేష్ట.

*7. ఔదార్యము :* దానము చేయు స్వభావము

## నాయక సహాయకులు :

నాయకులకు ప్రియురాండ్రను గూర్చు సహాయకులు నలుగు రుందురు. వారిని విట-పీఠమర్ద-చేట-విదూషకు లనెదరు.

*1. విటుడు* : జూదరి, కామతంత్ర కళల నెరిగినవాడు వేశ్యలను గూర్చుటలో నిపుణుడు మాటకారి.

*2. పీఠమర్దుడు* : ప్రధాన నాయకున కంటె తక్కువ గుణములు గలవాడు. అతని కనుచరుడు, కుపిత స్త్రీల నూఱ డించుటలో నేర్పరి

*3. చేటుడు* : కామినీ కాములకు సంధానము చేయు రహస్యములు తెలిసినవాడు.

*4. విదూషకుడు* : వికృత దేహము, మాటలు, వేషము కలిగి నవ్వించు వాడు; కలహాసక్తుడు.

నాయకునకు వీరేగాక కార్యచింతనమున మంత్రియు, దుష్ట నిగ్రహమున మిత్ర-కుమార-ఆటవిక-సామంత-సైనికు లును, ధర్మ కార్యాచరణమున ఋత్విజులు - పురోహితులు- బ్రహ్మ వేత్తలు - తాపసులును సందర్భము ననుసరించి కుబ్జ- షండాదులును సహాయకులుగ నుందురు

## నాయికాభేదములు :

నాయిక అనగా నాటకము లోని ప్రధాన స్త్రీ పాత్ర ఆమె నాయకుని సామాన్య గుణములను కలిగియుండును. నాయికలు స్వీయ, పరకీయ, సాధారణ అని మూడు విధములుగ నున్నారు

*1. స్వీయ* : అగ్ని సాక్షిగ వివాహమాడిన కులస్త్రీ.

*2. పరకీయ* : పరుని పరిణయమాడిన స్త్రీ. (అవివాహిత యగు కన్యగూడ పరకీయ యగునని కొందరి మతము )

*3. సాధారణ* : కళలయందు ప్రాగల్భ్యముగల వేశ్య.

స్త్రీలలో వయస్సును బట్టి - సంసారానుభవమును బట్టి ముగ్ధ - మధ్య - ప్రగల్భ అని మూడు విధము లుండును.

*1. ముగ్ధ* : ఉదయించుచున్న యౌవనము. లజ్జగలది

*2. మధ్య* : లజ్జ, మదనాభిలాష సమానముగా గల నవ యౌవనవతి.

*3. ప్రగల్భ* : సంపూర్ణ యౌవనముతో మదించి లజ్జను పో ద్రోలినది.

స్వీయ నాయికలలో మధ్యా ప్రగల్భలు; ధీర - అధీర - ధీరాధీర అను భేదములు కలిగియుందురు.

*1. మధ్య* : మధ్యధీర - మధ్యాధీర - మధ్య ధీరాధీర. (వీరు భర్తను ఎత్తిపొడుపు-కన్నీరు - పరుష వచనము అనువాని వలన సాధింతురు )

*2. ప్రగల్భ* : ధీర ప్రగల్భ - అధీర ప్రగల్భ - ధీరాధీర ప్రగల్భ (వీరు దోషయుక్తుడగు పతిని చేరనీయక. తాడనచే, దూషణచే సాధింతురు )

పైవిధముగ భాగ విభాగములు చేయుచు లాక్షణికులు నాయికలలో 384 భేదములున్నవని లెక్కపెట్టినారు. ఆయా వివరముల నాయా గ్రంథములలో జూడవలెను

## శృంగార నాయికలు :

శృంగార రసమునందలి అవస్థా భేదముల ననుసరించి నాయికలు స్వాధీనపతిక. వాసకసజ్జిక విరహోత్కంఠిత. ఖండిత. కలహాంతరిత. విప్రలబ్ధ, ప్రోషిత భర్తృక, అభిసారిక అను భేదములు కలిగియుందురు.

*1. స్వాధీన పతిక* : పరస్త్రీలను కోరక తనయందే అనురక్తుడైన పతిగలది.

*2. వాసక సజ్జిక* : కాంతుడు వచ్చునని గృహమును తన్ను అలంకరించు కొనునది.

*3. విరహోత్కంఠిత* : పతిచెప్పిన వేళకు రానిచో చత్తరపడునది

*4 ఖండిత* : ప్రియుడు పరకాంతతో భోగించి రాగా దుఃఖించునది.

*5 కలహాంతరిత* : పాదములపై బడిన ప్రియుని తిరస్కరించి తరువాత పశ్చాత్తాప పడునది.

*6 విప్రలబ్ధ* : సంకేత స్థలమున ప్రియుడు కానరాక పోగా బాధ పడునది.

*7. ప్రోషిత భర్తృక* : ప్రియుడు పరదేశములకు పోగా కృశించునది.

*8. అభిసారిక* : ప్రియుని దగ్గరకు తానే వెళ్ళుటో, అతనినే పిలిపించు కొనుటో చేయునది.

## నాయికా సహాయినులు ;

నాయకునకు సహాయకు లున్నట్లే, నాయికలకును సహాయినులు కలరు, వీరిని దూతిక లందురు. ఈ దూతికలు సఖి - నటి - దాసి - దాది అను నాలుగు విధములు, వీరు సామాన్యముగా నాయక సహాయకుల లక్షణములు కలిగియుందురు. దూతికలుగ పొరుగింటియామె, యోగిని, చాకలిది; శిల్పకారి మొదలైనవారు పనికి వత్తురు.

## స్త్రీ అలంకారములు ;

వస్త్రములు, నగలు, మాల్యములు, మైపూతలు. నవి యలంకారములు నాలుగు విధములు

## నాయిక అనుభావములు ;

శృంగార రసమునకు ఉద్దీపనములుగ చెప్పబడిన నాల్గింటిలో చేష్ట యొకటి. (సాహిత్య దర్పణ కారాదు లీ చేష్టలు 28 అనిరి) ఇవి నాయకునకు ఉద్దీపన విభావములును నాయికకు అను భావములును అగును. వీనిలో కొన్ని భావములు అయత్నజములు కొన్ని భావములు స్వభావజములు.

45

ఇవి భావ, హావ, హేలా, శోభా, కాంతి, మాధుర్య, దీప్తి, ప్రాగల్భ్య, ఔదార్య, ధైర్య, లీలా, విలాస, విచ్ఛిత్తి, విభ్రమ, కిలికించిత, మోట్టాయిత, కుట్టమిత, బిబ్బోక, లలిత, విహృతములను పేర బరగును.

— —

# చతుర్థ పరిచ్ఛేదము

## 3. రసములు :

నాట్యమునందు రసము ప్రధానాంశము; అదే నాట్యజీవనము. నాట్య సౌందర్యము ననుభవించునపుడు మన హృదయములలో కలుగు ఆనందమున కది కారణము దీని స్వరూపమును భరత మహర్షి యిట్లు నిరూపించెను "విభావ అనుభావ వ్యభిచారి భావముల సంయోగము వలన రస ముద్భవించును" అని దీనినే తరువాతి వారందరును అనుసరించిరి

**భావములు ;** రసస్వరూపము నెఱుగుటకు పూర్వముభావ, విభావ, అనుభావ, సంచారి భావముల స్వరూపమును దెలిసికొనుట చాల అవసరము "భావ" శబ్దమున కనేకార్థములు కలవు. వానిలో "చిత్తవృత్తి" అనునదొకటి ఇదియే మనకు ప్రకృత మైనది మానవునకుఁ గలుగు 'ప్రీతి', క్రోధ, భయ, ఆశ్చర్య, చింతా, ఔత్సుక్య, హర్షాదులు చిత్తవృత్తు లనబడును. భావ స్వరూపము నెఱుగుటకు రెండుదాహరణములను గమనింపుడు

ఉదా 1 : "ఒక సాయంకాలము వాహ్యాళికివెళ్ళి మనము పరధ్యాన ముగ నున్నపుడు హఠాత్తుగా పామొకటి కనుబడినచో మనస్సున భయము కలుగును శరీరము వణకును తక్షణమే వెనుకకో, ప్రక్కకో జరిగెదము "

ఉదా 2 : "ఒక తండ్రి బజారునకు బోవుచు ఆడుకొనుటకు బొమ్మను తెచ్చియిచ్చెదనని చిన్న బిడ్డకు చెప్పిపోవును ఆయన తిరిగి వచ్చు లోపలనే బిడ్డకుబలాట మెక్కువై తండ్రిరాక కెదురు చూచుచు మార్గమున తండ్రి కన బడినంతనే పరుగెత్తి వెళ్ళును"

ఈ రెండు సందర్భములలో కలిగిన భయ, ఔత్సుక్యములే భావములు. ఇట్టి చిత్తవృత్తి కలిగినప్పుడు దాని పరిణామము శరీరముపై కానరాకపోదు వణకు పుట్టుట, జరుగుట, నోట తడి యారుట అనునవి జరుగును భయమునకు సర్పము కారణము బిడ్డకు బొమ్మ తనచేతి కందకుండుటే కారణము ఈవిధముగ ప్రతి భావమునకు నేదోయొక కారణముండి తీరును. కారణములేనిదే యది కలుగదు కలిగిన తరువాత దాని పరిణామముగ నేదోకార్యము తప్పకజరుగును భావము మానసిక వ్యాపారమగుటవలన ప్రత్యక్షముగ గానరాక పోయినను, దాని కారణ, కార్యములు గోచరించుటను బట్టి ఈవ్యక్తి యందిట్టి భావ ముదయించినదని యూహింపవచ్చును ఈ భావములనే సందర్భమును బట్టి స్థాయిభావము లందురు అవి తరువాత వివరింపబడును

చిత్తవృత్తులను స్థూలముగనైన లెక్కపెట్టవచ్చును కాని వాని యుదయమునకిన్నియే కారణములని గట్టిగ చెప్పలేము ఒకే కారణము వలన ఒకనియందు భయము కలుగవచ్చును, మరొకనియందు కోపము కలుగవచ్చును వేరొకడు నిర్వికారుడు కావచ్చును ఇట్లే కార్యముల విషయము కూడ మానవుని యసం

ఖ్యాకములైన చర్యలన్నియు నిందు జేరును. ఒకే భావమునకు ఒకనియందనేక కార్యములు జరుగును. మరొకనియందు కొన్నియే గోచరించును. వేరొకడు అన్నిటిని అణచుకొనును. కావున నాయా వ్యక్తుల స్వభావములను, పరిస్థితులను గ్రహించి లోక జ్ఞానము నుపయోగించి చిత్తవృత్తులను, వాని కారణ కార్యములను తెలిసికోవలెను; అర్థము చేసికోవలెను.

ఇది లోక వ్యవహారము. లోక వృత్తమంతయు కావ్య నాటకములకు వస్తువు కాజాలును. అది కవి ప్రతిభా విశేషమున అపూర్వాకృతిని దాల్చి వెలువడినపుడొక నూత్న ప్రపంచమే సృష్టింపబడును. ఈ కళాప్రపంచమునందు "భావము" యొక్క కారణములను"విభావము"లనియు, కార్యములను "అనుభావము" లనియు వ్యవహరించుట సంప్రదాయము.

విభావములు ; ఈ విభావములు"ఆలంబనము"లని,ఉద్దీపనము" లని రెండు విధములు.

*1. ఆలంబన విభావము :* భావ మావిర్భవించుటకు మూలాశ్రయమైన కారణమే "ఆలంబన" మనబడును. దానికి యౌవనము, రూపము, లావణ్యము, సౌందర్యము, అభిరూపత, మృదుత్వము, సౌకుమార్యము అనునవి గుణములు.

*2. ఉద్దీపన విభావము :* ఉదయించిన భావమును పెంపొందించు సామగ్రి "ఉద్దీపన" మనబడును. అది గుణములు, చేష్టలు, అలంకారములు, తటస్థములు అని నాలుగు విధములు

(1) గుణములు:—ఆలంబన గుణములైన, యౌవనాదులు.

(2) చేష్టలు:— హావ భావాదులు.

(3) అలంకారములు: — హారనూపురాదులు.

(4) తటస్థములు:—చంద్రికా, మలయానిల, కోకిలాదులు

**అనుభావములు :**

చిత్తమునందు భావముద్రిక్తమైనప్పుడు వ్యక్తినడకలో, నుడిలో గానవచ్చు వికారముల ననుభావము లందురు. మనోగతమైన భావమును వ్యక్తముచేయు భ్రూ విక్షేప స్మితాదులు అనుభావములు వీనిలో ముఖ్యమైన వానిని "సాత్వికా" భావములనిరి.

**సాత్వికభావములు :**

ఇతరుల సుఖ దుఃఖాదులను భావించుట వలన కలుగు తన్మయత్వమును "సత్వ"మందురు. దానినుండి పుట్టిన భావములు సాత్విక భావములు. అవి స్తంభ, స్వేద, రోమాంచ, వైస్వర్య, కంప, వైవర్ణ్య, అశ్రు, ప్రలయములని ఎనిమిది విధములు.

*1.* స్తంభము : సంతోష భయాదులచే దేహము నిశ్చలముగ నుండుట.

*2.* స్వేదము : రతి శ్రమాదులచే చెమట పుట్టుట.

*3.* రోమాంచము: సంతోషాధిక్యముచే కలుగు పులకరింపు

*4.* వైస్వర్యము : సుఖదుఃఖాదుల వలన కలుగు డగ్గుత్తిక.

*5.* కంపము : క్రోధ భయాదులచే పుట్టు వణకు.

*6*. వైవర్ణ్యము : రోషవిషాదములచే మొగము తెల్లపోవుట

*7*. అశ్రు : సంతోష విషాదముల వలన వచ్చిన కన్నీరు

*8* ప్రలయము : సుఖ దుఃఖాదులచే తెలివిదప్పుట.

సంచారి భావములు:— మానవుని జీవితము నంటిపెట్టుకొని స్థిరముగ నిలచియుండు భావములను "స్థాయి" భావములందురు (ప్రీతి, శోకాదులు)

శంకా, ఔత్సుక్య, లజ్జా విషాదాదులు అట్లు స్థిరముగ నిలచి యుండునవి కావు కారణ బలమున వచ్చిన అవి ఆకారణము తొలగిన వెంటనే లయమును బొందును ఇవి స్థాయి భావములవలె తమ సంస్కార శేషమును మిగుల్పవు ఒక స్థాయి భావము నడచుచుండగా నీ రెండవ తెగకు చెందిన యనేక భావములు నడుమ-నడుమ సందర్భోచితముగ వచ్చి పోవు చుండును. అందువలన వీనిని వ్యభిచారి భావములందురు, వీనికే సంచారి భావము లనియు పేరు.

అలంకారికులు స్థాయి భావము నొక సూత్రముగను, సంచారి భావముల నందు గూర్చబడిన వివిధ వర్ణముల మణిపూసలుగను వర్ణించినారు ఇట్టి సంచారి భావములు ముప్పదిమూడు

అవి నిర్వేదము, గ్లాని, శంక, శ్రమము, ధృతి, జడత, హర్షము, దైన్యము, ఔగ్ర్యము, చింత, త్రాసము అసూయ, అమర్షము, గర్వము, స్మృతి, మరణము, మదము, సుప్తము,

నిద్ర. విబోధము, వ్రీడ, అపస్మారము, మోహము, మతి, అల స్యము, ఆవేగము, వితర్కము, అవహిత, వ్యాధి, ఉన్మాదము, విషాదము, ఔత్సుక్యము, చాపలము అనునవి.

ఈ భావములో నొకదానినుండి మరొక దానిని సామా న్యముగ వేఱుపరుప జాలినను, కొన్నిటికి వ్యత్యాసము చాల సూక్ష్మముగ నుండును చిత్తవృత్తు లన్నియు నీపట్టికలో చేరి యున్నవని చెప్పలేము మొత్తము మీద స్థాయులు కాని చిత్త వృత్తులన్నియు సంచారి భావములని చెప్పవచ్చును.

**స్థాయిభావములు :**

సజాతీయ భావములకుగాని, విజాతీయ భావములకుగాని చెదరక రసస్ఫూర్తివరకు స్థిరముగ నిలచియుండు భావములను స్థాయిభావము లందురు అనగా వాసనా రూపమున సామాజికుల హృదయమున నుండు రత్యాదులు. ఇవి తొమ్మిది. రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము. భయము. జుగుప్స. విస్మయము శమము అనునవి.

*1. రతి* : యువతీ యువకులకు పరస్పరము కలుగు స్థిర మైన కోరిక "రతి" అనబడును అది స్వాభావిక. అభియోగ. సంసర్గ. అభిమాన, ఉపమ. ఆధ్యాత్మిక, విషయములు అనువాని వలన కలుగును

ఈ రతి క్రమముగ అంకుర, పల్లవ కోరిక. పుష్ప. ఫల భోగములను అరవస్థలను బొంది ఆయా యవస్థలలో ప్రేమ, మాన. ప్రణయ స్నేహ. రాగ, అనురాగములని చెప్పబడును

2. హాసము వికారములైన ఆకార చేష్టాదికముల వలనను, వాని ననుకరించుట వలనను కలుగు మనోవృత్తిని హాసమందురు.

3. శోకము : ఇష్టజనుల వియోగ, వినాశముల వలనను, వ్యసనాదికమువలనను కలుగు చిత్తక్షోభము.

4. క్రోధము : గురు బంధు వధాదుల వలన మహాప రాధము వలన పుట్టిన మనోజ్వలనము, ఇది "క్రోధ"మని, "కోప" మని, "రోష"మని మూడు విధములుగ నుండును.

5. ఉత్సాహము : లోకోత్తర కార్యములను సాధించుటకై గట్టి యత్నము చేయించు మనోవ్యాపారము.

6. భయము : క్రూరమైన ఆకారాదులను జూచుట వలన కలుగు మరణాది మహానర్థ శంక.

7. జుగుప్స : మలము మొదలైన ఏహ్యవస్తువులను చూచి నపుడు కలుగు రోత.

8. విస్మయము : అలౌకికములైన వస్తు సందర్శనమున కలుగు ఆశ్చర్యము.

9. శమము : వైరాగ్యాదుల వలన కలుగు నిర్వికారము.

ఈ తొమ్మిదవ శమమును భరత, ధనంజయాదులు స్థాయిగా నంగీకరింపలేదు.

పైన తెలుపబడిన విభావ, అనుభావ, సంచారి భావముల చేత ఆస్వాద్యమానమగు స్థాయిభావమే రస మనబడును.

రస స్వరూపము :

"రస" పదమునకు "రుచి", "ప్రధాన సారము" అను రెండర్థములు కలవు. ఉపనిషత్తుల లోని "రసోవైసః" మొదలైన వాక్యములలోని రసపదమును గ్రహించి తాత్వికులు 'జగత్తునకు ప్రధానసార భూతమైన దేదియున్నదో, యోగులు దేనిని సాక్షాత్కరింపజేసికొని శాశ్వతానందము ననుభవించెదరో ఆ పరమాత్మయే 'రస'మని చెప్పిరి అలంకారికులు పై రెండర్థములను గ్రహించి కండచక్కెర, ఏలకులు, మిరియపుపొడి మొదలైనవి కలుపుట వలన జలము పానకముగ మారి ఆస్వాదింప బడునట్లే విభావ, అనుభావ, సంచారి-భావములచే పరిపుష్టిని బొంది స్థాయిభావము సహృదయులచే నాస్వాదింపబడుచున్నది ఆ యానంద విశేషమే 'రసము' అని నిరూపించిరి. కావుననే కావ్యానందము *బ్రహ్మానంద సహోదర* మని చెప్పబడినది.

నవరసములు :

అన్నిరసముల సారము ఒకటే అయినను అనుభవ కాలమందు విభావానుభావముల సమ్మేళనమును బట్టి ఒక్కొకదాని రుచియందు నొక్కొక్క వైలక్షణ్యము గానవచ్చును. ద్రాక్షారసము, నిమ్మపండ్లరసము, కండచక్కెర పానకములు మధుర పానీయములే యైనను ఒక్కొక్క దాని రుచియందును ప్రత్యేక వైచిత్రి యుండును. ఈ దృష్టితో రసములను వేరు చేయవచ్చును. అలంకారికులు తొమ్మిది స్థాయి భావములకును తొమ్మిది రసములను చెప్పిరి. అవి శృంగార, హాస్య,

కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత, శాంతము లనునవి.

*1. శృంగారము :* ఉత్తమ స్త్రీ పురుష ప్రకృతులకు సంబంధించిన "రతి" అను స్థాయి భావమునుండి జనించినది శృంగారము. రసము లన్నిటిలో నిది అత్యంత మధురము, ఆనంద జనకమునై యున్నది. ధర్మతత్పరులగు ఉత్తమ నాయకులచే అవలంబింపబడిన శృంగారము లోకకల్యాణ కారణమగును. క్షుద్రుల పాలైన శృంగారము ధర్మహీనము. కావున ఉపాదేయము కాదు. ఈ శృంగారము, సంభోగము, విప్రలంభము అని రెండు విధములు.

(1) సంభోగము :— ఇది సురత రూపముననే గాక పరస్పరాలోకన, ఆలింగన, చుంబనాదిరూపమున అనంత ప్రకారమై యుండును.

(2) విప్రలంభము :— ఇదివరకు కలయికలేని నాయికా నాయకులకు గాని, కలసికొని యెడబాటు బొందిన వారికి గాని తాము వాంఛించు ఆలింగనాదులు లభ్యము కానపుడు నిర్వేదాది సంచారి భావములచే వారి యనురాగ మెక్కువౌటను విప్రలంభ శృంగార మనెదరు. అది "పూర్వరాగ", "మాన", "ప్రవాస", "కరుణ"ములను నాల్గు విధములు.

1. పూర్వరాగము : నాయిక నాయకుని గలసికొనుటకు ముందు కలిగిన కోరిక. ఈ పూర్వరాగమునందే దశావస్థలు కలుగును.

చూచుట, చింతించుట, తలచుట, నిద్రకు దూరమగుట, కృశించుట, అన్నిటిపై అనిష్టము కలుగుట, లజ్జవిడుచుట, ఉన్మాదము, తెలివిదప్పుట, మరణించుట అనునవి దశమన్మథావస్థలు.

2. మానము : వలదు, వలదను ప్రతిషేధ వాక్యములు బలుకుచు అభిలషించు ఆలింగనాదులకు ఆటంకము కలిగించుట 'మాన' విప్రలంభము. అది "ప్రణయ మానము". "ఈర్ష్యా మానము" అని రెండు విధములు.

ప్రణయ మాన మనగా నాయికా నాయకు లిరువురకును ప్రేమాతిశయముచే గలుగు కోపము. అది అనునయములచే తీరును. ఈర్ష్యామాన మనగా నాయకుడు పరకాంతా సక్తుడై నపుడు నాయికకు కలుగు అసూయ. దానిని సామ, దాన, భేద, నమస్కార, ఉపేక్ష రసాంతరములచే నాయకుడు పోగొట్టి నాయికను ప్రసన్నురాలిగ జేసికొనును.

3. ప్రవాసము : ఏదేని కార్యమువలనగాని, శాపమువలనగాని నాయికానాయకులు గలిసికొనుటకు వీలులేకుండ భిన్నదేశములందుండ వలసి వచ్చినచో నా స్థితిని ప్రవాస మనెదరు.

4. కరుణము : నాయికా నాయకులలో నొకరు లోకాంతరమును బొంది కాలాంతరమున ఆ శరీరముతోనే బ్రతికి వచ్చినచో ఆ యవస్థను కరుణ విప్రలంభమందురు. అట్లు బ్రతికి రాకున్నను, శరీరాంతరముతో వచ్చినను అది కరుణ రసముగా మారిపోవును.

2. హాస్యము : వికృతమైన ఆకార వేష భాషా చేష్టల వలన హాసమను స్థాయి భావమునుండి కలిగినది హాస్యము అది స్మితము, హసితము, అవ హసితము, అప.హసితము, అతి హసితము అని ఆరు విధములు.

( ) స్మితము:—దంతములు కానరాకుండ కన్నులను, చెక్కిళ్లను వికసింప జేసి నవ్వుట.

(2) హసితము:—కొద్దిగా దంతములు కానవచ్చునట్లు నవ్వుట

(3) విహసితము:— కంఠ గతముగ మధురధ్వని చేయుచు, ఓరజూపు చూచుచు నవ్వుట.

(4) అవ హసితము:—భుజము లెగురవేయుచు,.తలను వంచి ముక్కుపుటములు వికసింపజేసి నవ్వుట.

(5) అప హసితము:— తగిన కారణములేకుండ అవయము లదరునట్లు, కన్నీరు వెడలునట్లు నవ్వుట.

(6) అతి హసితము:— చేతులతో డొక్కలు పట్టుకొని, కన్నీరు గార్చుచు గట్టిగానవ్వుట.

3. కరుణము : ఇష్టజన వినాశమున, అనిష్టప్రాప్తి వలన కలుగు శోకమునుండి కరుణరస ముదయించును ఇది మిగుల సుకుమార మైనది. ఈ రసానుభవ కాలమున హృదయము ద్రవించిపోవును కావుననే భవభూతి మహాకవి "కరుణ మొక్కటే రసము"-అనునంత వరకు పోయెను.

*4 రౌద్రము :* క్రోధమను స్థాయి భావమునుండి కలిగినది రౌద్రము. శత్రువు చేసిన ఘోరాన్యాయమునకై అతని రక్తము త్రాగినను తృప్తి దీరదను సంతవరకును క్రోధము పోవును ఇది సాధారణగా ఉద్ధత ప్రకృతులకు కలుగునది

*5 వీరము :* ఉత్సాహమను స్థాయి భావమునుండి ఉత్పన్నమైనది వీరరసము అది ఉత్తమ నాయకాశ్రితము. ఉదాత్త ప్రకృతులకు కలుగు ఉత్సాహము యుద్ధాభి ముఖముగనే ఉండ నక్కరలేదు త్యాగము, సన్మార్గప్రవృత్తి, పరోపకారము మొదలైన రీతులతో గూడ ప్రవర్తింప వచ్చును కావున ఈ వీరము దానవీర, ధర్మవీర, దయావీర, యుద్ధవీరములని నాలుగు విధములుగ విభాగింప బడినది.

*6. భయానకము :* వికృత శబ్దమును వినుట, ఇతరుల త్రాసాదులను జూచుట మొదలైన వాని వలన కలుగు భయమునుండి భయానకరసము పుట్టును భయము మానవ సహజప్రవృత్తియే అయినను నాగరిక సంస్కారము పెరిగినకొలంది అతడు దానిని నిగ్రహించుట కలవాటు చేసికొనును. దానిని ప్రదర్శించుట అవమానమనికూడ భావించును. కావున ఉత్తమ ప్రకృతిగల వీరుల కది అసహజమని లాక్షణికుల అభిప్రాయము. కావున ప్రాకృత మనుష్యులను, స్త్రీలను, పశ్వాదుల నాశ్రయించుకొని భయానక రసముంచునట్లు కవులు నిరూపింపవలెను.

*7. బీభత్సము :* ఇష్టము కాని వానిని జూచుటచేతను, దుష్టములైన గంధ, రస, స్పర్శ, శబ్దాదులచేతను కలుగు జుగుప్స

అను స్థాయి భావమునుండి బీభత్సము జనించును. శోకాదుల యందు మనస్సు లగ్నమైనంత సులభముగా జుగుప్సయందు కాదు ఒక వస్తువు జుగుప్సితమా, కాదా అనునది దానిని జూచు దృష్టిమీద, నిరూపించు విధానము మీద ఆధారపడియుండును.

*8. అద్భుతము :* విస్మయ మనెడు స్థాయిభావము వలన ఉత్పన్నమగు రసము అద్భుత మనబడును ఉత్తమ రూప, శిల్పాదులను జూచుట అతిశయోక్తులను వినుట మొదలైన వానివలన విస్మయము కలుగును. శృంగారమువలె నిదియు మిగుల వ్యాపకమైన రసము. దాని కాధారమైన విస్మయము అందరి అనుభవములో నుండునది.

అద్భుత రసమును "శేష" రసమని పిలువ వచ్చును ఒక సందర్భమున గోచరించు రసమేదో నిర్ణయించుట కష్టమైనపుడు బహుశః అచటిది అద్భుతరసమై యుండును కొందరు లాక్షణికులు ఇంకను ముందుకు బోయి అద్భుత మొకటే రసమనియు చెప్పినారు.

*9. శాంతము :* శమ మను స్థాయి భావమునుండి శాంత రస ముద్భవించును. జ్ఞానము, ఆనందము అను పరిశుద్ధ ధర్మములుగల విషయోప భోగరహితమైన ఆత్మయే శమము. అది ఆత్మ స్వభావము.

దీనిని భరత, ధనంజయాదు లంగీకరింపక పోయినను ఆనంద వర్ధన, అభినవ గుప్తాదులు శమ స్థాయీ భావమును శాంత రసమును చక్కగా నిరూపించినారు.

"యమ నియమాదులు శాంతమున కను భావములు పర మేశ్వరాను గ్రహము మొదలైనవే విభావములు. లౌకికాలౌకిక ములైన చిత్తవృత్తు లన్నియు దీని సంచారి భావములు వీనివలన ఆత్మ జ్ఞానమను స్థాయి కలుగును దానినుండి శాంతరసము జనించును " అని వారి సిద్ధాంతము.

ఈ విధముగ ఆస్వాద్యములైన భావములందు, రసము లందు గొన్ని దశల నాలంకారికులు వివరించిరి వానిని ఆభాసము లందురు. ఆభాసమనగా : అ విధముగ కాన్పించునది భావాభాస మనగా - భావము కాకున్నను భావమువలె కాన్పించునది అట్లే రసా - భాసమునకును విస్పత్తియగును ఈ అభాసమునకు అనౌ చిత్య ప్రవర్తనమే మూల కారణము.

**భావా భాసములు :** భావము అనౌచిత్యము నందు ప్రవ ర్తించినచో - భావాభాసము అగును, అందు భావోదయ, భావ శాంతి, భావసంధి, భావ శబలత అను నాలుగు భేదములు కలవు.

1. *భావోదయము :—* భావస్థితిలో క్రొత్తగా మరొక భావము పుట్టుట.

2. *భావశాంతి :—* వృద్ధిహొందియున్న భావములు నాశము హొందుట.

3. *భావసంధి :—* భిన్న కారణములచే కలిగిన రెండు భావముల కలయిక.

4. *భావశబలత :—* భావములకు పరస్పరము కలిగిన సమ్మర్దము.

రసాభాసము : పై అనౌచిత్యము అసత్యత్వ, అయోగ్యత్వముల వలన కలుగును. రసముగాని, భావముగాని అచేతన వస్తువుల ఆలంబనములతో ప్రతిపాదింప బడినచో 'అసత్యత్వ' మగును. నీచ మనుష్య, తిర్యగ్జంతువుల ఆలంబనము నొందినచో 'అయోగ్యత్వ' మగును. ఈ రసా-భాసము లనేక విధములు ఒక్క స్త్రీని పలువురుకామించుట, పురుష ప్రేమ, మునిపత్ని, గురుపత్ని మొదలైన వారియందు ప్రవర్తించుట మొదలగు ననేక కారణములచే రసాభాస మేర్పడును.

ఈ ఆభాసము లన్నియు కావ్యనాటకములలో నభివ్యక్తమై సామాజికునకు ఆస్వాదము కలిగించును.

"రమ్యం జుగుప్సిత ముదార మథాపినీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
యద్వాప్యవస్తు కవి భావక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే"
(ద రూ. 4-86).

---